తారాతీరం

# ఐటెం బాంబ్!

మన సౌత్ సినిమాల్లో ఐటమ్ సాంగ్స్ విశిష్టత వేరు.. మొదట్లో మాస్‌ని అలరించటానికి మాత్రమే పరిమితమైన ఈ పాట ఇపుడు ప్రెస్టేజ్ స్టేటస్‌గా మారింది. మెలికలు తిరిగే సోయగాలను వెతకటం మాత్రం కాస్త కష్టమైన పనే..



యువ నటి రాయ్‌లక్ష్మి ఐటమ్ సాంగ్స్‌లో రచ్చ లేపటం కలిసొచ్చే అంశం.. బలుపులో రవితేజతో, సర్దార్‌లో పవన్‌కల్యాణ్ సరసన, రీసెంట్‌గా ఏకంగా మెగా స్టార్‌తో ఖైదీ నెంబర్ 150లో ఐటమ్‌కు చిందేసింది.. పటాస్ రీమేక్‌లో లారెన్స్ సరసన ఇరగదీయ నుందట. అందానికి స్టెప్స్ సైతం తోడవ వ్వటంతో లక్ష్మీరాయ్ ఐటమ్‌లో రాజ్య మేలుతోంది..



# కోపం వచ్చేసింది

సెల్ఫీలతో చెలరేగిపోతున్న మోడల్స్‌కి గట్టి షాకే ఇచ్చాడంట మన బన్నీ.. నవ్వుతూ నవ్విస్తూ సరదాగా ఉండే బన్నీకి ఉన్నట్టుండి కోపం రావటానికి దారితీసిన పరిస్థితులేమిటో చూద్దాం.. దువ్వాడ జగన్నాథ్ సినిమాకోసం సంగీత్ సీన్ లాంటిది ఒక షూట్ చేయాల్సి వచ్చిందట.. ఈ సంగీత్ సీన్‌లో యాక్ట్ చేయటానికి వచ్చిన మోడల్స్ అంతా షూటింగ్ గ్యాప్‌లో సెట్ మొత్తం లీక్ అయ్యేలా సెల్ఫీలు తీసుకోవటం మొదలుపెట్టారట. దీంతో బన్నీకి చిర్రెత్తుకొచ్చిందట. మొహమాటం లేకుండా షూటింగ్ వివరాలేమీ బయటకు వెళ్లటానికి వీల్లేదు సో..ఎవరూ సెల్ఫీలు అవీ తీసుకో వద్దు.. అని నిర్మొహమాటంగా చెప్పేశారట.



# యంగ్ టైగర్ సెంటిమెంట్

ఇండస్ట్రీలో సెంటిమెంట్లకు కొదవలేదు.. ఎవరి స్థాయిలో వాళ్లకు ఈ సెంటిమెంట్లు ఉండటం సహజం. ఈ విషయంలో తన సెంటిమెంట్‌వల్ల ఇతరులకు ఇబ్బంది కలగకుండా జాగ్రత్తపడ్డారు యంగ్ టైగర్. తనను రిక్వెస్ట్ చేసిన వారి విన్నపాన్ని సున్నితంగా తిరస్కరించారు. ఇంతకూ అది దేనిగురించి అనుకుంటున్నారా.. ఘాజీ తెలుగు వెర్షన్ గురించే.. ఇటీవల స్టార్స్ సినిమాలకు మరో స్టార్ వాయిస్ ఓవర్ చెప్పటం జరుగుతోంది. ఈ క్రమంలో రానా నటించిన ఘాజీ హిందీ వాయిస్ ఓవర్ బిగ్‌బి అమితాబ్ చెప్పారట.. ఇదే క్రమంలో తెలుగు వాయిస్ ఓవర్ చెప్పేందుకు ఎన్టీఆర్‌ను ఈ చిత్రం బృందం సంప్రదించగా దాన్ని ఆయన సున్నితంగా తిరస్కరించారట.. దీనికి గల కారణాన్ని తన సెంటిమెంట్‌గా చెప్పారట!

కె.సురేష్ బాబు

An ISO 9001 - 2000 Certified ®




# పాజిటివ్ హోమియోపతి

*|| 100% Cure is Our Priority ||*

NOW @ ఖమ్మం




## శ్వాసలో ఆశ

శ్వాస సంబంధిత సమస్యల నుండి విముక్తి

**Anti Allergy** CLINIC

తుమ్ములు, అస్తమా, సైనసైటిస్, స్కిన్ అలర్జీ, దగ్గు, దురద సమస్యలకు పూర్తి చికిత్స

## కీళ్ళ నొప్పులకు 100 రోజుల్లో ఉపశమనం

వెన్ను, కీళ్ళ నొప్పులకు సంపూర్ణ చికిత్స
(ఆపరేషన్ లేకుండానే)

- లుంబార్ స్పాండిలైటిస్ • ఆస్టియోఆర్థరైటిస్
- సర్వికల్ స్పాండిలైటిస్ • టెన్నిస్ ఎల్బో
- సయాటికా • హీల్ పెయిన్ • ఫ్రోజెన్ షోల్డర్
- రుమాటాయిడ్ ఆర్థరైటిస్ • సోరియాటిక్ ఆర్థరైటిస్
- కాల్షియం డెఫిసియన్సీ






## ఆపండి ! సోరియాసిస్ ఇప్పుడే

సైడ్ ఎఫెక్ట్స్ లేకుండా

- ఎగ్జిమా • కార్న్స్ / వార్ట్స్ • విటిలిగో
- లైకెన్ ప్లానస్ • సోరియాటిక్ ఆర్థరైటిస్
- ప్లేగు సోరియాసిస్ • గుట్టేట్ సోరియాసిస్
- పస్టులర్ సోరియాసిస్
- ఇన్‌వర్సివ్ సోరియాసిస్ • ఎక్సైఫోడర్మిక్.

డాక్టర్ కన్సల్టేషన్: **903-056-1144** | TOLL FREE: **1800 108 1900**

బేగంపేట | అమీర్‌పేట | జూబ్లీహిల్స్ | కొండాపూర్ | కూకట్‌పల్లి | విక్రమ్‌పురి | A.S.రావు నగర్
కాచిగూడ | దిల్‌సుఖ్‌నగర్ | మెహిదీపట్నం | నిజామాబాద్ | హన్మకొండ | కరీంనగర్ | ఖమ్మం



www.positivehomeo.in




5 ఫిబ్రవరి 2017

## మంచి ముత్యాలు

దుస్తులు మాసిపోతే, ఇల్లు మురికిగా ఉంటే
సిగ్గుపడతాం. మరి మనోభావాలు
మాసినపుడు, స్వభావానికి
మురికి అంటినపుడు
ఎందుకు సిగ్గుపడం?

-మార్క్ ట్వైన్

## విషయ విశేషం








## భావ వీచిక



### ముదిరిన మూఢత్వం..

విశాల విశ్వంలో నిరంతరం ఎన్నో సంఘటనలు జరగటం సహజం. కానీ కొన్ని సంఘటనలు మనల్ని అవాక్కయ్యేలా చేస్తాయి. పురోగమిస్తున్నాం అనుకుంటున్న తరుణంలోనే తిరోగమన దాఖలాలు దర్శనమిస్తుంటాయి. నాలుగైదు రోజుల కింద జార్ఖండ్‌కు చెందిన రాజ్రప్పలో ఉన్న చిన్నమస్తిక ఆలయంలో సంజయ్ నట్ అనే యువకుడు బాకుతో తన స్వహస్తాలతో గొంతుకోసుకుని అమ్మవారికి తనను తాను బలి ఇచ్చుకున్నాడు. బక్సార్‌లోని బలిహార్ గ్రామానికి చెందిన సంజయ్ వయసు 35 ఏళ్లు. మూఢభక్తితో నిండు జీవితాన్ని నిండుసున్న చేసుకున్నాడు.

భక్తి వేరు, మూఢభక్తి వేరు. భక్తి ఉండటంలో తప్పులేదు. ఎవరి నమ్మకాలు, ఎవరి ఇష్టాలు వారివి. కానీ ఏ నమ్మకమైనా అది కష్టనష్టాలను కలిగించేదిగా, మూఢమైందిగా ఉన్నప్పుడే అభ్యంతరకరమయ్యేది. దేవాలయాల్లో జంతుబలులు చట్టవిరుద్ధం అన్న సంగతి తెలిసిందే. అటువంటిది మనిషి స్వయంగా తనను తానే బలి ఇచ్చుకుంటే... మనిషిగా పుట్టినందుకు జీవితాన్ని సార్థకం చేసుకోకుండా నిరర్థకం చేసుకున్నతీరు కలచివేస్తుంది. సంజయ్ తండ్రి పోలీస్ కానిస్టేబుల్‌గా పని చేస్తున్నాడు. అంటే విద్యావంతుల కుటుంబమే. మరి సంజయ్ అలా తనకు తానుగా బలి ఇచ్చుకోవడం వెనుక అతడి ఆలోచనఏమిటో?

మనిషి క్రమశిక్షణతో, ధార్మిక భావనలతో ఉండేందుకు భక్తి తోడ్పడవచ్చు. కానీ అది మూఢంగా మారితే ప్రమాదకారే అవుతుంది. ప్రజల్లో మూఢత్వ నివారణకు విద్యావంతులు, మేధావులు నిరంతరం ప్రయత్నించవలసిన అవసరం ఎంతైనా ఉంది. ప్రజల్లో బలులు, ఆత్మబలుల భావనలను సమూలంగా తొలగించాలి. విలువైన జీవితాన్ని అర్థరహితంగా, ఘోరంగా తుంచేసుకోవడం ఎంతమాత్రం తగదు. తాము చేసే చర్యలు ఇతరులపై ప్రభావం కలిగిస్తాయన్నది ఎవరూ విస్మరించకూడదు. జీవితం జానపద చిత్రం కాదు, తెగిన మొండెం తిరిగి అతుక్కోవటానికి, అద్భుతాలు జరిగి, బతికి బట్టకట్టడానికి. వాస్తవంలో బతకాలి ..వాస్తవికంగా ఆలోచించాలి.

## తేఖ లు

### చక్కటి సమకాలీనాంశం..

జనవరి 22 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన కవర్ స్టోరీ 'ఇది స్వైపింగ్ కాలం!..ఇక సొమ్ము చెల్లింపు ఎంతో సులభం' ఎంతో బాగుంది. స్వైపింగ్ మెషిన్ల పుట్టుక దగ్గర్నుంచి, నగదు రహిత లావాదేవీల తీరుతెన్నుల్ని వివరించిన తీరు ఎంతో బాగుంది. మీకు మా ధన్యవాదాలు.

-డి.పవన్‌కుమార్, హైదరాబాద్; ఎన్.ప్రవీణ్‌రెడ్డి, వరంగల్; వి.శాంతిప్రియ, తిరుపతి.

### కథ బాగుంది..

జనవరి 22 వార్త ఆదివారం అనుబంధంలో ప్రచురించిన సీనియర్ రచయిత్రి సువర్ణా కన్నన్ కథ 'సొంతగూడు' చాలా బాగుంది. ఇక భావవీచికలో పేర్కొన్నట్లు వ్యాపారంలో కుసంస్కార ధోరణిని అందరూ ముక్తకంఠంతో ఖండించవలసిందే. 'సంఘీ'భావం' అమ్మాయికాదు..అమ్మాయేకావాలి స్ఫూర్తిదాయకంగా ఉంది. 'మూడోకన్ను' సైనికుల గుండెచప్పుళ్లను వినిపించింది. బ్యాక్ కవర్ ప్రకృతి చిత్రం పరవశింపజేసింది.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్టణం.

### సంచిక నచ్చింది..

జనవరి 22 వార్త ఆదివారం అనుబంధంలో 'సంఘీ'భావం'లో అమ్మాయే కావాలి ఎంతో ఆదర్శవంతంగా ఉంది. చిత్రభారతిలో సంక్రాంతికి విడుదలైన భారీచిత్రాల సమీక్ష చక్కగా ఉంది. 'డామిట్' కథ ముగింపు బాగా నవ్వించింది. కవితలు ఆకట్టుకున్నాయి. వాట్సన్ మేధా ఘనతను వివరించిన శ్రీసత్య గౌతమికి ధన్యవాదాలు. ప్రేమకు, కళకు గల అవినాభావ సంబంధాన్ని మురళీకృష్ణ కథలో తెలియజెప్పిన తీరు బాగుంది. స్వైపింగ్‌తో చెల్లింపులు అలవాటుపడటానికి ఇంకా కొంతకాలం పడుతుంది.

-డా.శివభూషణం, కర్నూలు.

### చైతన్యపరిచే వ్యాసాలు..

జనవరి22 వార్త ఆదివారం అనుబంధంలో 'భావవీచిక' బాగుంది. వ్యాపారంలో కుసంస్కారం ప్రదర్శించే వారికి గుణపాఠం నేర్పవలసిన అవసరం ఎంతైనా ఉంది. 'సైనికులూ మనుషులే' అన్న 'మూడోకన్ను' ఆర్టికల్ ఎంతో బాగుంది. సైనికుల భద్రత విషయంలో నిర్మాణాత్మక చర్యలు చేపట్టవలసిన అవసరం ఉంది. కవర్‌స్టోరీలో నుడివినట్లు ఇది స్వైపింగ్ కాలమే మరి. అయితే ప్రతిచోటా స్వైపింగ్ మెషిన్లు ఉంటేనే సొమ్ము చెల్లింపు సులభతరమయ్యేది.

-అత్తివిల్లి బాలసుబ్రహ్మణ్యం, కూకట్‌పల్లి.

'సంఘీ'భావం

# పోషకాహార విధానం రావాలి!



దేశంలో సైన్స్, టెక్నాలజీ పెరిగేకొద్దీ మనిషి ఆయుఃప్రమాణం రోజురోజుకూ పెరుగుతున్నది. ఇది ఎవరూ కాదనలేని నిజం. కానీ ఇంకా మనిషి ఆయుర్దాయం పెరగాలంటే జీవనశైలి మారాలి. తినే ఆహారం, తీరు మారాలి. అప్పుడే మనిషి సగటు జీవన ప్రమాణం మరింతగా పెరుగుతుంది. వ్యాధులపై జీవితకాలం పెట్టే చికిత్స, మందుల ఖర్చు తగ్గుతుంది. ఇది అందరికీ తెలిసిన విషయమే. అయితే తెలియని విషయమేమిటంటే ఏది పోషకాహారం, ఏది పోషకాలు లేని చెడు ఆహారం, ఏది ఎప్పుడు తినాలి? అనేదే సగటు భారతీయుడి మదిని తొలుస్తున్న ప్రశ్నలు. ప్రాణాంతక వ్యాధులు పెరిగేకొద్దీ ప్రజల్లో ఆరోగ్య ఆహార స్పృహ పెరుగుతున్నది. ఏది తినాలన్నా ముందు తినేబోయేది ఎలాంటి ఆహారమని ప్రతి వ్యక్తి ఆలోచించే పరిస్థితి ఏర్పడింది. ఏది పోషకాహారం అనే విషయంలో ప్రజల్లో ఇప్పటికీ అనేక అనుమానాలు, అపోహలున్నాయి. పోషకాహారంపై ప్రజల్లో చివరకు విద్యావంతుల్లో కూడా శాస్త్రీయ అవగాహన లేదు. అందుకే ఆకలి తీర్చుకోవడంకోసం ఏది పడితే అది తిని ప్రజలు రోగాలు కొనితెచ్చుకుంటున్నారు. ప్రపంచీకరణతో కొంత, వత్తిడితో కూడిన జీవనం కొంత ప్రజల ఆహారపు అలవాట్లను మారుస్తున్నది. ముఖ్యంగా క్విక్ ఫుడ్ కావాలనే తపనలో ప్రజలు పోషకాలు లేని ఆహారం తిని జబ్బుల పాలవుతున్నారు. ఈ పరిస్థితిలో ప్రభుత్వమే ప్రజలకు ఆహారం విషయంలో దిక్సూచిగా నిలిచే పోషకాహార విధానాన్ని ప్రకటించాలి. ఇప్పటివరకు ఇలాంటి విధానమేదీ లేదు. ఇప్పుడు ఈ ఆలోచన ఎందుకు వచ్చిందంటే ఇటీవలే హైదరాబాద్‌లోని నేషనల్ ఇనిస్టిట్యూట్ ఆఫ్ న్యూట్రిషన్ 2017కు సంబంధించి ఫుడ్ కాంపోజిషన్‌ను విడుదల చేసింది. ఇది 46 ఏళ్ల తరువాత విడుదలైంది. అంతకుముందు 1971లో ఈ కాంపోజిషన్‌ను విడుదలచేసారు. అయితే అప్పటికి అప్పటికి ఎంతో తేడా ఉంది.

ఆహార శాస్త్రవేత్తలు ఈసారి ఫుడ్ కాంపోజిషన్‌ను మరింత సమగ్రంగా ప్రజలకు రోజువారీ గైడ్‌లా ఉపయోగపడేలా రూపొందించారు. ఇది చూసి ముచ్చట పడిన కేంద్ర ప్రభుత్వం ఇంకో అడుగు ముందుకేసి మొబైల్ ఫోన్ల యుగంలో న్యూట్రిషన్ యాప్‌ను తీసుకు రావాలని సూచించింది. ఇది ప్రతి వ్యక్తి చేతిలో ఉంటే తినబోయేముందు తను తినేది ఎలాంటి ఆహారమో తెలుస్తుందని దానివల్ల పోషకాహారమే ప్రజలు తీసుకునే అవకాశం ఉందని కేంద్ర ఆరోగ్య మంత్రిత్వశాఖ ఇక్కడి శాస్త్రవేత్తలను ఆదేశించడంతో వారు సరికొత్త మొబైల్ యాప్‌ను రూపొందించే ప్రయత్నాల్లో ఉన్నారు. ఇది బహుశా రెండు నెలల్లో ప్రజల్లోకి రావచ్చు. యాప్‌తో ప్రజలకు పోషకాహార గైడ్ చేతుల్లోకి వచ్చినట్లవుతుంది. ఇప్పుడు రూపొందించిన పుస్తకం రెండు కేజీల బరువుంది. అంత భారీ పుస్తకాన్ని ప్రజల్లోకి పంపిణీ చేయడం సులభం కానందున యాప్ రూపంలో తీసుకురాబోతున్నారు. ఇది చాలా మంచి ప్రయత్నమే. దీంతోపాటు ప్రభుత్వం ప్రజల ఆరోగ్య జీవనశైలిని పెంపొందించాలంటే ఏది తినాలి? ఏది తినకూడదు? అని చట్టబద్ధంగా హెచ్చరించే పోషకాహార విధానాన్ని ప్రకటిస్తే ఇంకా బాగుంటుందని పలువురు సూచిస్తున్నారు. కొత్తగా విడుదల చేసిన ఫుడ్ కాంపోజిషన్‌లో దేశంలోని వివిధ ప్రాంతాల ప్రజలు వినియోగించే 526 ఆహార పదార్థాలపై శాస్త్రవేత్తలు విస్తృత అధ్యయనం నిర్వహించారు. ఇది అయిదేళ్లపాటు కొనసాగిన ప్రక్రియ. ఇందులో మనం తినే అన్ని ఆహార పదార్థాల్లో కేలరీలు, కార్బోహైడ్రేట్లు, ప్రొటీన్లు, కొవ్వులు, విటమిన్లు, ఫైబర్, షుగర్, కరోటినాయిడ్స్, మినరల్స్, స్టార్చ్, ఫ్యాటియాసిడ్స్, ఎమినో యాసిడ్స్... ఏ మేరకు ఉన్నాయో తెలియజేసే టేబుల్స్ కూడా ఉన్నాయి. ఇది చూస్తే చాలు.. మనకు ఎలాంటి ఆహారం, ఎలాంటి నూనెలు తీసుకోవాలో ఇట్టే తెలిసిపోతుంది.

శాకాహారంలో, మాంసాహారంలో ఏది ఉత్తమమో కూడా ఈ టేబుల్స్‌ని చూసి ఒక నిర్ధారణకు రావచ్చు. సాంప్రదాయ ఆహారం మంచిదా? ఫాస్ట్ ఫుడ్ లేదా జంక్ ఫుడ్ మంచిదా? అనేది తెలుసుకునే అవకాశం ఏర్పడుతుంది. ఆహారంపై ఉన్న సవాలక్ష సందేహాలు తొలగిపోతాయి. ప్రజలు ఊబకాయం బారిన పడి బరువు తగ్గడంకోసం లక్షలు ఖర్చు పెట్టాల్సిన అవసరం కూడా తప్పుతుంది. ఇంతగా బహుళ ప్రయోజనకారిగా ఉన్న ఫుడ్ కాంపోజిషన్‌ను ఒకసారి చూస్తే మనం రోజూ అన్నం తినాలా, చపాతి తినాలా, మాంసం తినాలా, పళ్లు, కూరగాయలు తినాలా, ఏది తిన్నా ఎలాంటి సమయంలో ఎంత మేరకు తీసుకోవాలనేది కూడా ఈ కాంపోజిషన్‌లో ఎంతో చక్కగా రూపొందించారు. ఇప్పటివరకు అన్నంగా మారుతున్న బియ్యంలో ప్రొటీన్లు లేవని, ఉన్నా తక్కువని అంతా భావిస్తున్నాం. కానీ బియ్యంలో అంటే పూర్తిగా తెల్లనివి కాకుండా దంపుడు బియ్యంలో ప్రతి 100 గ్రాముల్లో 9.16 మి.గ్రా. ప్రొటీన్లు ఉంటాయి. బియ్యం కాక మనం తినే అటుకులు, పారా బాయిల్డ్ రైస్, మరమరాలు పూర్తిగా దంచిన బియ్యంలో కూడా 7 నుంచి 8 మి.గ్రా. ప్రొటీన్లు ఉంటాయి. పూర్తిగా తెల్లగా పట్టుకుంటే జారిపోయే బియ్యంలోనే ప్రొటీన్లు ఉండవు. పోషకాహారమంతా తొలగిపోతుంది.

ఇక నూనెలో ఇప్పటిదాకా మనం సన్‌ఫ్లవర్ లేదా రైస్ బ్రాన్, సోయాబీన్ ఆయిల్ ఉత్తమమని అనుకున్నాం. కానీ అన్నిటికంటే ఆరోగ్యకరమైనది కుసుమనూనె (శాఫ్ ఫ్లవర్ ఆయిల్) అత్యుత్తమమైనదని వారు తేల్చారు. మనం తీసుకునే ఆయిల్స్‌లో మంచి కొవ్వు ఉన్న నూనెల్లో రెండో గ్రేడ్ సన్ ఫ్లవర్‌కు దక్కగా మస్టర్డ్ ఆయిల్‌కు మూడో స్థానం, సోయాబీన్‌కు నాలుగో స్థానం, రైస్ బ్రాన్‌కు ఎనిమిదో స్థానం మనమంతా ఇష్టంగా తీసుకునే నెయ్యికి పదకొండో స్థానం, వనస్పతికి పన్నెండో స్థానం, కొబ్బరినూనెకు పదమూడో స్థానం దక్కింది. చెడు కొవ్వు ఎక్కువగా ఉండే ఆయిల్స్‌లో అగ్రస్థానంలో వనస్పతి, కోకోనట్ ఆయిల్స్ ఉన్నాయి.

పప్పుల్లో శనగపప్పులో, పొట్టు తీసిన పెసర్లలో, సోయాబీన్‌లో, కందిపప్పులో అత్యధిక ప్రొటీన్లు ఉన్నాయి. మనం ఎక్కువగా వాడే గోధుమపిండిలో 10 గ్రా. ప్రొటీన్లే ఉన్నాయి. ప్రతి మనిషికి అంటే పురుషుడికి ప్రతిరోజూ 60 గ్రా, స్త్రీకి 50 గ్రా, పిల్లలకు 60-80 గ్రాముల ప్రొటీన్లు అత్యవసరం. ఇవి లోపిస్తే మనిషి జబ్బులపాలు కావడం ఖాయం. ఈ టేబుల్‌ను చూస్తే ప్రతిఒక్కరి ఆహారపు అలవాట్లు మారే అవకాశాలున్నాయి. ఈ కాంపోజిషన్ ఎంతగా ఉందంటే మనం తినే గుడ్డు, గుడ్డు రూపంలో తీసుకుంటే ఎంత మేలు? ఆమ్లెట్‌గా తీసుకుంటే ఎంత లాభమనేది కూడా వివరించడంతో దేశప్రజలందరికి రాబోయే ఫుడ్ యాప్ ఎంతో ఉపయోగకరంగా ఉంటుందనడంలో సందేహం లేదు.

– డాక్టర్ గిరీష్‌కుమార్ సంఘీ




# అసలు 'పద్మా'లు వారు!

– ఎ.వి.వి. ప్రసాద్

**ప్రముఖ సినీ నేపథ్య గాయకుడు జేసుదాస్, ప్రముఖ ఆధ్యాత్మిక వేత్త జగ్గీవాసుదేవ్, యు.ఆర్.రావుగా సుపరిచితులైన భారత అంతరిక్ష పరిశోధన సంస్థ మాజీ ఛైర్మన్ ఉడుపి రామచంద్రరావు వంటి దిగ్గంతులకు పద్మవిభూషణ్ ప్రకటించడంలో ఆశ్చర్యమేమీ లేదుగాని చింతకింది మల్లేశానికి, 'వనజీవి' రామయ్య వంటివారికి ఈసారి పద్మశ్రీలు ప్రకటించడం నిజంగానే చాలామందిని ఆశ్చర్యానికి గురి చేసింది. వారు ఆయా పార్టీలకు దాసోహమని ఉండకపోవచ్చు. కానీ సమాజం కోసం, తమ చుట్టూ ఉన్న ప్రజల కోసం జీవితాన్నంతా ధారపోస్తున్న నిజమైన శ్రమజీవులు, నిజమైన మేధోజీవులు వారు. బంగారానికి తావి అబ్బినవారంటే వారే మరి!.....**

**పరుల మేలు కోరి బతుకు త్యాగము చేయు**
**మట్టిలోని మేలి మణులు వారు;**
**అలరె, జనులు మెచ్చ అజ్ఞాత 'పద్మా'లు**
**విశ్వవినుత నామ! వినురవేమ!!**

సువర్ణానికి సువాసన అబ్బితే ఎలా ఉంటుంది! అసలే బంగారం.. దానికి మరింత చక్కని సౌరభం. ఇక దాని సొగసు వర్ణించడం కష్టమే. అద్దితే ఎక్కువ కాలం ఉండదు. అది సహజంగా అబ్బాలి. అంటే పసిడికి చక్కని తావి దాని తయారిలోనే కనిపించాలి. అప్పుడు అది పదికాలాల పాటు నిలుస్తుంది. తాజాగా ప్రకటించిన 'పద్మ' పురస్కారాలలో ఈసారి అటువంటి సువాసనలే కనిపించడం విశేషం. ఆ పురస్కారాలకు ఎంపికయ్యే ప్రతిభావంతుల 'ప్రతిభ' విషయంలో సాధారణంగా చాలా విమర్శలు తరచుగా వినిపిస్తూంటాయి. వాటి వెనుక చాలా రాజకీయం జరుగుతూంటుందనీ, అధికార పార్టీల కనుసన్నల్లో మెలిగేవారిని మాత్రమే ఆ అత్యున్నత పురస్కారాలు వరిస్తూంటాయనే ఆరోపణలు కూడా అప్పుడప్పుడు వినబడు తూంటాయి. నిజంగా ఎంతో ప్రతిభ కలిగి ఆ పురస్కారాలు లభించని వారిని చూస్తే అటువంటి అభిప్రాయమే కలుగుతుంది. ఒక్కొక్కసారి పద్మ విభూషణ్, పద్మ భూషణ్ వంటి అత్యున్నత పురస్కారాలకు ఎంపికయిన వారిని చూసి చాలా మంది పెదవి విరవడం కూడా కనిపిస్తూంటుంది.



అప్పుడే..వాటి వెనుక ప్రతిభేతర కారణమేదో ఉండిఉండవచ్చనే అభిప్రాయం వ్యక్తమవుతూంటుంది. దఙన్లకొద్దీ ప్రకటించే ఆ పురస్కారాలలో నిజానికి 'అర్హులు' చాలా తక్కువమందే ఉంటూంటారు. ఏవేవో ఇతరేతర కారణాల వల్ల కొందరు ఎంపికవుతూంటారు. కొన్ని కారణాల వల్ల ఎంతో ప్రతిభా సంపన్నులకు సైతం తగినంత 'పబ్లిసిటీ' లభించకపోవచ్చు. అలా లభించని వారిని ప్రతిభామూర్తులు కాదని ఎలా అనలేమో, విపరీతమైన ప్రచారం జరిగిన వారందరిని గొప్ప ప్రతిభా వంతులని కూడా అనలేం. అందుకే ప్రతిభకు పురస్కారం బంగారానికి తావి అబ్బినట్లుగా ఉండాలిగాని, అద్దినట్లుగా కనిపించకూడదు. ఈ సంవత్సరం ఆ మూడు అత్యున్నత పురస్కారా లకు ఎంపికైనవారిని చూస్తే..వారిలో అధిక శాతం మంది బంగారానికి తావి అద్దినవారుగా గాక అబ్బినవారుగానే కనిపిస్తారు. ఇటీవలి సంవత్సరాలలో ఇంతమంది నిజమైన ప్రతిభావంతులు ఈ అత్యున్నత పురస్కారాలకు ఎంపిక కావడం కూడా ఇదే మొదటిసారి అనిపిస్తుంది.

ఇంతకు ముందు లేని (అసలు లేదని కాదు.. న్యాయ నిర్ణేతలనుంచి గాని, ప్రభుత్వం నుంచి గాని వినిపించని) ఒక కొత్తమాట కూడా ఈ సంవత్సరం పురస్కారాల ప్రకటన సందర్భంగా వినిపించడం విశేషం. జనవరి 25వ తేదీన ప్రకటించిన ఈ అవార్డులలో దాదాపు 20 మందిని 'అన్‌సంగ్ లీడర్స్' పేరిట ఎంపికచేశారు. అంటే ఆయారంగాలలో ప్రతిభా వంతులే..అయినప్పటికి బయటి ప్రపంచానికి అంతగా తెలియనివారన్న మాట. వారు నిర్విరామంగా తమ కార్యరంగంలో దూసుకుపోతూనే ఉంటారుగాని దానికి తగిన పబ్లిసిటీ వస్తున్నదో లేదో పట్టించుకోరు. తమను ఎవరైనా గుర్తిస్తున్నారో, లేదో అనే విషయం కూడా ఆలోచించరు. తమ పరిశోధనలనో, తమ సమాజ సేవనో వారు ప్రజలందరికి పంచిపెడుతూనే ఉంటారు. అలాంటివారిలో కొందరిని గుర్తించి వారిని కేంద్రప్రభుత్వం 'పద్మశ్రీ'లతో గౌరవించడం చూస్తే ఆ పురస్కారాలకు పట్టిన రాజకీయ గ్రహణం క్రమంగా వదులుతున్నదనే అభిప్రాయం కలుగుతుంది. వివిధ రంగాల్లో దేశానికి సేవలందించిన మొత్తం 89 మంది ప్రభుత్వం ఆ మూడు అత్యున్నత పురస్కారాలకు ఎంపిక చేయగా, వారిలో 75 మంది వరకు 'పద్మశ్రీ'లు అందుకోవడం మరో విశేషం. ఏడుగురికి పద్మవిభూషణ్, మరో ఏడుగురికి మాత్రమే పద్మభూషణ్ పురస్కారాలు లభించగా, మిగిలిన వారందరు పద్మశ్రీలే కావడం ప్రత్యేకంగా చెప్పవలసిన మరో అంశం. ప్రకటించిన జాబితాలో మహిళలు 19మంది ఉండగా, వారిలో కూడా ఎక్కువ మంది 'అజ్ఞాత కథానాయికలే' కావడం మరో విశేషం. క్రీడా రంగంలో కూడా 8 మందికి 'పద్మ' పురస్కారాలు లభించడం కూడా ఘనంగా చెప్పుకోవలసిన అంశమే.

కేంద్రంలో అధికారంలో ఉన్న ప్రభుత్వానికి అనుకూలంగా కనిపించే వారికే సాధారణంగా 'పద్మభూషణ్' వంటి అత్యున్నత పురస్కారం లభిస్తుందనే అపప్రథ గతంలో చాలాసార్లే వినిపించింది. అధికార పార్టీల అడుగులకు మడుగులొత్తేవారు. అరకొర ప్రతిభతో అందలాన్ని అధిరోహించాలను కొనేవారు ఏదో విధంగా 'ప్రయత్నాలు' చేసి ఈ పురస్కారాలు అందుకొంటూ ఉంటారనే అభియోగం కూడా గతంలో ఎక్కువగా వినిపించేది. కానీ ఈసారి ప్రకటించిన పురస్కారాల్లో సగం మంది పైగా బయటి ప్రపంచానికి ఎక్కువగా తెలియనివారే. అంటే ఎంపిక పూర్తిగా కాకపోయినా చాలావరకు పారదర్శకంగానే జరిగిందన్నమాట.



ప్రముఖ సినీ నేపథ్య గాయకుడు జేసుదాస్, ప్రముఖ ఆధ్యాత్మిక వేత్త జగ్గీవాసుదేవ్, యు.ఆర్.రావుగా సుపరిచితు లైన భారత అంతరిక్ష పరిశోధన సంస్థ మాజీ ఛైర్మన్ ఉడుపి రామచంద్రరావు వంటి దిగ్గంతులకు పద్మవిభూషణ్ ప్రకటించడంలో ఆశ్చర్యమేమీలేదుగాని చింతకింది మల్లేశానికి, 'వనజీవి' రామయ్య వంటివారికి ఈసారి పద్మశ్రీలు ప్రకటించడం నిజంగానే చాలా మందిని ఆశ్చర్యానికి గురి చేసింది. వారు ఆయా పార్టీలకు దాసోహమని ఉండకపోవచ్చు. కానీ సమాజంకోసం, తమ చుట్టూ ఉన్న ప్రజల కోసం జీవితాన్నంతా ధారపోస్తున్న నిజమైన శ్రమజీవులు, నిజమైన మేధోజీవులు వారు. బంగారానికి తావి అబ్బినవారంటే వారే మరి!

**********

సామాజిక, రాజకీయ, శాస్త్ర, సాంకేతిక, వైద్య, సంగీత, ఆధ్యాత్మిక తదితర రంగాలలో విశేష కృషి చేసిన ఎందరికో ఇంత వరకు లభించిన పురస్కారాలు ఒక ఎత్తు, ఇప్పటిదాకా మనకు పెద్దగా పరిచయంలేనివారు, పేరు ప్రతిష్టల కోసం కాకుండా కేవలం సేవాదృక్పథంలో, ఆర్తుల అవసరాలకు తగినట్లుగా సేవలందిస్తున్న వారికి అత్యున్నత పురస్కారాలు లభించడం మరో ఎత్తు. ప్రముఖ టెకీలైన మైక్రోసాఫ్ట్ సిఇఒ సత్యనాదెళ్ల, గూగుల్ సిఇఒ సుందర్ పిచాయ్‌లకు ఈసారి పద్మ పురస్కారాలు లభించవచ్చనే ప్రచారం ముందుగా చాలా జరిగింది. రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా ప్రభుత్వం ప్రకటించే జాబితాలో ఈసారి మొత్తం 125 మంది ఉన్నట్లు అధికారవర్గాలే స్వయంగా ప్రకటించాయి. కానీ చివరికి ప్రకటన వెలువడేసరికి జాబితాలో 89 పేర్లు మాత్రమే కనిపించాయి.



అంటే 'వడపోత' మళ్లీ మళ్లీ జరిగిందనుకోవాలి. ఈ 89 మందికి గాను మొత్తం 18 వేల నామినేషన్లు వచ్చాయంటే 'నిజమైన ప్రతిభ'ను వెలికితీయడానికి నిర్ణేతలు ఎన్ని జాగ్రత్తలు తీసుకొన్నారో స్పష్టమవుతుంది. ఈ పురస్కారాలకోసం కేంద్ర హోంమంత్రిత్వశాఖ తొలిసారి ఆన్‌లైన్‌లో దరఖాస్తులను ఆహ్వానించిందంటే సిసలైన ప్రతిభకు గుర్తింపునివ్వడానికి ఎంత శ్రద్ధ తీసుకొన్నారో విదితమవుతుంది. కొన్ని రాష్ట్ర ప్రభుత్వాలు చేసిన అనేకానేక సిఫార్సులు తెర వెనక్కి వెళ్లిపోగా, కేవలం ఆన్‌లైన్ దరఖాస్తులు పంపిన పలువురికి అత్యున్నత పురస్కారాలు లభించాయి. ఆ దరఖాస్తులో వారు పేర్కొన్న విశిష్టతలను బేరీజు వేసుకొని వాటికి తగినట్లుగా ఈ పురస్కారాలను ప్రకటించినట్లు కేంద్ర హోంశాఖ చెబుతోంది. అంటే నిజమైన ప్రతిభకు సిఫార్సులెందుకనే మాటను ఈసారి కేంద్రం రుజువుచేసిందనే అనుకోవాలి.

పద్మవిభూషణ్, పద్మభూషణ్ అవార్డులకు ఆంధ్ర, తెలంగాణ ప్రభుత్వాలు పలువురి పేర్లను సిఫారసు చేయగా వాటిలో ఒక్కటి కూడా కేంద్రం ఆమోదానికి నోచుకోలేదంటే ఈ రెండు రాష్ట్రాలలో అంతటి ప్రతిభా సంపన్నులు లేరని కాదు. ఆ ప్రభుత్వాల ఎంపికలో ఏదో లోపమున్నదనే విషయం అర్థమవుతోంది. ఉమ్మడి రాష్ట్ర విభజన జరిగిన తర్వాత గత సంవత్సరం ఇద్దరికి పద్మవిభూషణ్, పద్మభూషణ్ (రామోజీ, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్)లు లభంచగా, ఈసారి ఒక్కరు కూడా ఆ అత్యున్నత పురస్కారాలకు ఎంపిక కాలేకపోయారు. అంటే ఎంపికలో ప్రభుత్వాల వైఫల్యానికి ఇది అద్దం పడుతున్నదన్నమాట.

కేంద్రంతో చాలా సన్నిహితంగా వ్యవహరించే ఎపి సిఎం చంద్రబాబు సొంత రాష్ట్రానికి రెండు పద్మశ్రీల కంటె సాధించలేక పోవడం కూడా ఆలోచించ వలసిన అంశమే. అదే సమయంలో తెలంగాణకు ఆరు పద్మశ్రీలు లభించగా, వాటిలో ఎక్కువగా 'అన్‌సంగ్‌లీడర్'లకే లభించడమూ గమనించవలసిన అంశమే. అంటే ఇక్కడ స్పష్టమవుతున్న మరో అంశం- అవార్డుల ఎంపికలో 'రాజకీయం' పాలు తగ్గుతున్నదన్నదే. ఒలిపింక్స్‌లో బ్యాడ్మింటన్ రజత పతక విజేత అయిన సింధుకు పద్మభూషణ్ ఇవ్వాలని రెండు తెలుగు ప్రభుత్వాలు సిఫారసు చేసినా అది బుట్ట దాఖలు కావడం గమనించవలసిన మరో అంశం. 'పద్మ' అవార్డుల కోసం తెలంగాణ ప్రభుత్వం 25 పేర్లను, ఎపి ప్రభుత్వం 22 పేర్లను సిఫారసు చేయగా ఆ జాబితాల నుంచి ఒకరిద్దరికి మాత్రమే చివరికి ఖరారు కావడాన్నిబట్టి చూస్తే కేంద్రం ముందు ముందు ఇదే విధానాన్ని కచ్చితమైన ప్రమాణాలతో కొనసాగించగలదనే అనిపిస్తుంది. అలా చేస్తేనే నిజమైన ప్రతిభకు పట్టం కట్టినట్లవుతుంది.

కేవలం ప్రజాసేవే పరమావధిగా జీవితాన్ని ఒక ఆదర్శమార్గంలో నడిపిస్తున్న విశిష్టులు పలువురిని వివిధ రాష్ట్రాల నుంచి ఎంపిక చేస్తూ అనుసరించిన విధానం ఈ 'పద్మా' లలో కనిపించే కొత్త అంశమని చెప్పాలి. వారిలో చాలామంది స్థానికంగా తప్ప ఇతర ప్రాంతాలకు తెలియనివారే. అటువంటి 'మట్టిలో మాణిక్యాల'లో ప్రధానంగా చెప్పుకోవలసింది 'వనజీవి' దరిపల్లి రామయ్య (తెలంగాణ). నాలుగు దశాబ్దాలుగా మొక్కలు నాటడం, ప్రజలకు పర్యావరణ పరిరక్షణపై అవగాహన కలిగించడం. ఇదొక్కటే ఆయన జీవితం. 'వృక్షో రక్షతి రక్షితః' అనే నినాదం రాసి ఉన్న అట్టలను మెడలో వేసుకొని భార్యతో కలసి రామయ్యచేస్తున్న 'హరిత ప్రచారం' చూస్తే ఆయనకు పద్మశ్రీ ఇవ్వవలసిన అవసరమేమిటో, ఎలాంటి సమాజ సేవకులకు ఆ పురస్కారం అందించాలో అర్థమవుతుంది. ఇప్పటిదాకా కోటి మొక్కలను నాటడంతోపాటు రెండుకోట్ల విత్తనాలను వెదజల్లారంటే దానివెనుక ఉన్న దీక్ష సాధారణమైనది కాదనే అనిపిస్తుంది. మొక్కల పెంపకం, వాటి లాభాలగురించి ఎంతోమంది ఎన్నో మాట్లాడుతుంటారు గాని జీవితాన్ని భార్యతో కలిసి హరిత ఉద్యమానికి అంకితం చేయడమంటే రామయ్యను చూసి అంతా నేర్చుకోవలసింది ఎంతో ఉన్నదని కూడా అనిపిస్తుంది.

ఆ తర్వాత చెప్పవలసింది 'చేనేత' ఆణిముత్యమైన చింతకింది మల్లేశాన్ని. చేనేత కార్మికుల కష్టాలను గట్టెక్కించడానికి మల్లేశం (తెలంగాణ) తయారు చేసిన 'ఆసు' యంత్రం ఇప్పుడు ఆ రంగాన్ని కొత్త పుంతలు తొక్కిస్తోంది. చేనేత పనిలో తల్లి పడుతున్న కష్టాన్ని చూడలేక ఏడు సంవత్సరాలు శ్రమించి మల్లేశం ఆ యంత్రాన్ని రూపొందించారట. నేత పనిలో కీలకమైన ఆసుపోయడానికి ఇప్పుడు ఈ యంత్రాన్నే అంతా ఉపయోగిస్తున్నారు. 'నైపుణ్యం ఉంటే పేదలకు కూడా గుర్తింపు వస్తుందనడానికి నేనే ఉదాహరణ' అనే మల్లేశంకంటె పద్మశ్రీకి అర్హులెవరుంటారు మరి! 'మొక్క చనిపోతే నేను చనిపోయినట్లే' అని చెప్పే దరిపల్లి రామయ్య కంటె పద్మశ్రీకి అర్హులెవరుంటారనుకోవాలి!

శారీరక లోపాలున్నా కుంగిపోకుండా తమ విజయాలతో స్ఫూర్తిని నింపిన 'అన్‌సంగ్ లీడర్స్' మరికొందరు కూడా పద్మశ్రీకి ఎంపికైన వారిలో ఉన్నారు. పద్మశ్రీకి ఎంపికైన మధుర గాయని అనూరాధ పాడ్వాల్ గురించి చాలా మందికి తెలుసు. కానీ 'చదువుల తల్లి'గా పేరు పొందిన వి.కోటేశ్వరమ్మ (ఎపి), టెలికాం రంగ నిపుణుడు టిహెచ్ హనుమాన్ చౌదరి (ఎపి) పద్మశ్రీకి ఎంపిక కావడమూ విశేషమే. ఇతర రాష్ట్రాల నుంచి కూడా ఇలాంటి 'ప్రతిభా రత్నాలు' పలువురు ఈసారి ఎంపికయ్యారు.

పశ్చిమ బెంగాల్‌లో 'అంబులెన్స్ దాదా'గా గుర్తింపు పొందిన కరీముల్ హక్, కర్ణాటకకు చెందిన సామాజిక కార్యకర్త గిరీష్ భరద్వాజ్, గత 68 ఏళ్లుగా యుద్ధ విద్యల ప్రాచుర్యానికి కృషి చేస్తున్న కేరళకు చెందిన మీనాక్షి అమ్మ, గుజరాత్‌కు చెందిన 'హైవే మీసయ్య'గా పేరున్న సుబ్రతోదాస్, మధ్య ప్రదేశ్‌కు చెందిన భక్తియాదవ్, అసోంకు చెందిన ఎరా అహ్మద్, నేపాల్‌కు చెందిన అనూరాధ కొయిరాలా...

ఇలా ఎంతోమంది 'రాజకీయ' వాసన లేని ప్రతిభా సంపన్నులను పద్మశ్రీ పురస్కారాలు వరించడంతో బంగారానికి నిజమైన తావి అబ్బడమంటే నిజంగా ఇదేనేమో! అనిపిస్తుంది. కేంద్ర ప్రభుత్వం కనీసం 'పద్మ' పురస్కారాల ఎంపికలోనైనా ఇలాంటి పారదర్శకత ఇప్పటికైనా ఆరంభించడం ప్రశంసనీయమే. ఇదే విధానం మున్ముందు కూడా కొనసాగిస్తే ఇంకా ఎన్నో 'మట్టిలో మాణిక్యాలు' తమ ప్రతిభా ప్రదర్శనతో సమాజాన్ని మెరిపిస్తాయి.

# గట్టెక్కని గండం!

## మన రైలు ప్రయాణం..

**కవర్‌స్టోరీ**

కె.సురేష్‌కుమార్
రిపోర్టర్, స్టేట్ బ్యూరో.

**ఆందోళనను అక్షరాల్లో చెప్పేటప్పుడు 'గుండెల్లో రైళ్లు పరుగెడుతున్నాయి' అని అంటుంటాం. కానీ ఆ పరుగుల రైళ్ల ప్రయాణమే ప్రమాదభరితమైతే ఆ ఆందోళనను దేనితో పోల్చగలం? రైలు టికెట్‌పై 'హ్యాపీ జర్నీ' అనే ఉంటుంది. కానీ ఏక్షణంలో ఏ ప్రమాదమో అన్న బెంగ ప్రయాణికుడికి తప్పటంలేదు. బోగీలు విడిపోవటం, రైలు పట్టాలు తప్పటం, నదుల్లో పడటం, మరో రైలును ఢీకొనటం, విద్యుత్తు షార్ట్ సర్క్యూట్‌తో రైలు పెట్టెలు తగలబడటం..ఇలా ఏదో రూపంలో ప్రయాణికులకు అకాల మృత్యువు ముంచుకొస్తోంది. గమ్యం చేరేదాకా యమగండకాలమే. అయితే ఈ వ్యాసం రాసే సమయానికి 2017 బడ్జెట్‌లో, గతంలో మాదిరి రైల్వే బడ్జెట్ ప్రత్యేకం కాకుండా, జనరల్ బడ్జెట్‌లో భాగంగానే ప్రవేశ పెడతారని, అయితే ఈసారి బడ్జెట్‌లో భద్రత, అవస్థాపన అభివృద్ధి విషయాలపై ప్రధానంగా దృష్టి కేంద్రీకరించినట్లు తెలుస్తోంది. సేఫ్టీ ఫండ్‌కు రూ.20,000కోట్లు కేటాయించినట్లు తెలుస్తోంది. ఈ నేపథ్యంలో . .. మన దేశంలో రైల్వే రంగం పరిస్థితి ఏమిటి, రైళ్లలో భద్రతా వ్యవస్థ ఎలా ఉంది? ప్రమాదాలకు ప్రధాన కారణాలేమిటి? ఇంతవరకు రైల్వే రంగానికి జరిగిన నిధుల కేటాయింపు తీరుతెన్నులు.. వగైరా వగైరా అంశాల సమాహారం ఈవారం మీకోసం...**

ప్రపంచం ఆధునిక సాంకేతికత వైపు పరుగులు పెడుతుంది. కానీ మన రైల్వే మాత్రం సాంకేతిక పట్టాలెక్కడం లేదు. ప్రపంచాన్ని కళ్ళముందుంచే పరిజ్ఞానం అందుబాటులో ఉన్నా... రైల్వేలో చిన్న చిన్న లోటుపాట్లను సైతం గుర్తించేందుకు మానవ పరిశీలనలే దిక్కుగా మారాయి. కంప్యూటర్ కాలంలోనూ పాత పద్ధతులతోనే భారత రైల్వే రంగం ముందుకు సాగుతోంది. ఈ కారణంగానే రైల్వేలో ప్రమాదాలు పెచ్చుమీరుతున్నాయి. ప్రయాణికుల భద్రత గాలిలో దీపంలా మారింది. రైల్వే భద్రతకు అత్యధిక ప్రాధాన్యత అంటూ బడ్జెట్ ప్రతిపాదనల్లో భారీగా ప్రతిపాదనలు చేసే మన పాలకులు ఆచరణలో వాటిని గాలికొదిలేస్తున్నారు. దీంతో రైల్వే ప్రమాదాల వల్ల భారీ సంఖ్యలో ప్రయాణికులు తనువు చాలిస్తున్నారు. గత అనుభవాలను పాఠాలుగా నేర్వని రైల్వే అధికారులే కాదు మన పాలన యంత్రాంగం సైతం సంఘటనలు జరిగినప్పుడు మాత్రమే స్పందించడం షరా మాములుగా మారింది. సంఘటన స్థలాలను పరిశీలించి భారీ పరిహారాలతో పాటు పాత ప్రకటనలను వల్లె వేయడంతో పాటు మరోసారి భద్రత అంశాలను తెరపైకి తేవడం సర్వసాధారణమైంది. భద్రత ప్రమాణాలను కోసం రైల్వేశాఖ వేసిన పలు కమిటీలు అనేక సిఫార్సులను చేసింది. ఈ సిఫార్సులు బుట్టదాఖలు కావడంతో భద్రతను ప్రభుత్వాలు పక్కన పడేస్తున్నాయి. కనీసం ఆయా సిఫార్సులను పరిశీలించే పరిస్థితుల్లో కూడా మన పాలకులు లేకపోవడం దురదృష్టకరం. ఇలాంటి సంఘటనల నేపథ్యంలో రైల్వే ప్రయాణాలంటేనే ప్రజలు బెంబేలెత్తే పరిస్థితి నెలకొంది.

తాజాగా కాన్పూర్‌తో పాటు హీరాకుండ్ ప్రమాదాల నేపథ్యంలోనే రైల్వేశాఖ మేల్కొని భద్రతకు ఆచరణాత్మకమైన చర్యలు తీసుకోవాలనేది సామాన్య ప్రజల మనోగతం.



### భద్రత లేని రైలు బండి...

బండిరా... పొగబండిరా అని పిలుచుకునే రోజులకు కాలం చెల్లింది. ఒకప్పుడు దొరలకు మాత్రమే పరిమితమైన రైలు బండి ఇప్పుడు సామాన్య, బహు బహుళ్య వాహనమైంది. రోజువారీ జీవనంలో భాగమైంది. అదే స్థాయిలో ప్రమాదాలు సైతం పెరుగుతున్నాయి. ఎప్పుడు ఎక్కడ ఏ రైలుకు ఏమవుతుందో తెలియని పరిస్థితి నెలకొంది.

ప్రమాదాల నివారణ కోసం వేసిన కమిటీలు ఇచ్చిన నివేదికలు ఎప్పటికప్పుడు బుట్టదాఖలవుతూనే ఉన్నాయి. చాలీచాలనీ సిబ్బంది, అరకొరగా సాగుతున్న ఆధునీకరణ పనులు భారత రైల్వేకు శాపంగా మారాయి. బుల్లెట్ ట్రైన్ కోసం పాలకులు పరుగులు తీస్తుంటే రైలు బండి గమ్యానికి క్షేమంగా చేరిస్తే చాలని సామాన్య ప్రయాణికులు భావిస్తున్నారు. ప్రమాదాల పట్టాలపైనే భారత రైల్వే ప్రయాణం సాగిస్తుండగా బుల్లెట్ ట్రైన్‌ను పట్టాలెక్కిస్తామంటూ ప్రధాన మంత్రి నరేంద్రమోడీ ప్రకటనలు చేస్తున్నారు.

యూరోపియన్ రైల్వే ఏజన్సీస్ నిర్వహించిన సర్వే ప్రకారం దేశంలో సగటున ప్రతి ఏడాది 130కి పైగా ప్రమాదాలు జరుగుతున్నాయి. మరణాల సంఖ్య కూడా అదే స్థాయిలో భారీగా ఉంటుందని వెల్లడించింది. భారత్ తర్వాత రెండో స్థానంలో జర్మనీ నిలిచింది. బ్రిటన్‌లో సగటున ఏడాదికి 26 రైలు ప్రమాదాలు జరుగుతున్నాయి. స్పెయిన్‌లో 22, ఫ్రాన్స్‌లో 85, ఆస్ట్రేలియాలో 44, బెల్జియంలో 24 ప్రమాదాలు జరుగుతున్నాయి. ఈ అంకెలు చూస్తే చాలు రైలు ప్రమాదాల నివారణలో మనం ఎక్కడు న్నామో ఇట్టే అర్థమవుతుంది. ప్రమాదం జరిగినప్పుడు హడావిడిగా తీసుకునే మొక్కుబడి చర్యలు తప్ప శాశ్వత చర్యలు తీసుకోకపోవడంతో ప్రమాదాల ప్రయాణం అనివార్యమవుతుంది. వాస్తవానికి రైలు ప్రమాదాల నివారణే లక్ష్యంగా దేశానికి స్వాతంత్ర్యం రాకముందే ఒక కమిటీని నియమించారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత కూడా అనేక కమిటీలు ఏర్పాటు చేసినప్పటికీ చర్యలు మాత్రం శూన్యమే. రైల్వేలను సమగ్ర దృక్పథంతో అభివృద్ధి చేసేందుకు ఇప్పటి వరకు ఏ ప్రభుత్వం దృష్టి సారించిన దాఖలాలు లేవు.

భారత దేశానికి 1947లో స్వాతంత్ర్యం వస్తే చైనా 1949లో స్వతంత్ర్య దేశంగా ఏర్పడింది. అప్పటికి చైనాలో 27వేల కిలోమీటర్ల మేర మాత్రమే రైల్వే లైన్స్ వుంటే నేటికి 1,10,000 కిలోమీటర్లకు విస్తరించింది. చైనా - టిబెట్ సరిహద్దులో కొండలపైన కూడా రైల్వేలైన్‌ను నిర్మించడమే కాక 300 కిలోమీటర్ల వేగంతో ప్రయాణం చేయగలిగే రైల్వే వ్యవస్థను చైనా ప్రభుత్వం అభివృద్ధి చేసింది. భారత దేశంలో స్వతంత్ర్యం వచ్చే నాటికి 55 వేల కిలోమీటర్ల మేర రైల్వే లైన్ ఉంటే నేటికీ 66 కిలోమీటర్లకు మాత్రమే చేరింది. 70 ఏళ్లల్లో కేవలం 11వేల కిలోమీటర్లు మాత్రమే పెరిగిదంటే ప్రభుత్వ ప్రాధాన్యతేంటో ఇట్టే అర్థమవుతుంది.

రైల్వేలో సంస్కరణలను అమలు చేయడమంటే కార్మికుల సంఖ్యను కుదించడం పనులను ప్రైవేటు వ్యక్తులకు అప్పగించడమనే రీతిలో ప్రభుత్వం వ్యవహరిస్తోంది. 5.5 కోట్ల రూపాయలను ఖర్చు పెడితే రైల్వేను ఆధునీకరించవచ్చని అనేక నివేదికలు తెలియజేశాయి. అభివృద్ధి చెందిన దేశాల సరసన చేరుతున్నామని గొప్పలు చెప్పుకుంటున్న మనం ప్రమాణాల విషయంలో మాత్రం అట్టడుగున ఉన్నాం. 2011లో చైనాలో లుమయూన్ పుటాంట్ మార్గంలో కొండ చరియలు విరిగిపడి పట్టాలు ధ్వంసం కావడంతో ఈ విషయం కేవలం 8 నిమిషాల్లో ఆ మార్గంలో వెళ్ళాల్సిన రైళ్లన్నింటికీ ఆ సమాచారం చేరిపోయింది. అది చైనా ఘనత. 2,26,427 కిలోమీటర్ల నెట్‌వర్క్‌తో ప్రపంచంలోనే అతి పెద్ద రైల్వే వ్యవస్థగా ఘనతకెక్కిన అమెరికన్ రైల్వేస్ రక్షణ వ్యవస్థ ఏర్పాటులోనూ నెంబర్ వన్‌గా ఉంది. పాజిటివ్ ట్రెయిన్ కంట్రోల్ ప్రాజెక్టుల సాయంతో 16 రాష్ట్రాల్లో 9 రాష్ట్రాలను ప్రమాద రహిత మార్గాలుగా తీర్చిదిద్దుతున్నారు. గంటకు 100 కిలో మీటర్ల వేగంతో వెళ్తేనే మన పట్టాలు పనికి రావు,. అలాంటిది గంటకు 400 కిలో మీటర్ల వేగంతో నడిచే బుల్లెట్ ట్రైన్స్ జపాన్‌లో పరిగెడుతున్నాయి. ఇలాంటి స్థితిలో మన పాలకులు బుల్లెట్ ట్రైన్ల గురించి మాట్లాడడం హాస్యాస్పదమే అవుతుంది.



## రైలు పట్టాలపై ప్రాణాలు హరీ...

దేశంలో రైలు ప్రమాదాలు జరిగిన ప్రతిసారి అందుకు మానవ తప్పిదమా సిబ్బంది అలసత్వమా తీవ్రవాదుల విద్రోహమా అన్న చర్చలు జరుగుతున్నాయే తప్ప రైళ్లల్లో భద్రతను పెంచేందుకు నిర్దిష్టంగా ఎలాంటి చర్యలు తీసుకోవడం లేదు. సువిశాల భారతదేశంలో ప్రయాణీకుల, సరుకుల రవాణాకు రైళ్లే ప్రధాన ఆధారం. అయితే రైలు ప్రయాణమంటేనే హడలిపోయే పరిస్థితి ఏర్పడింది. రైళ్ల పట్టాలు తప్పి భారీగా ప్రాణనష్టం జరగడం, లక్షల్లో నష్ట పరిహారం ప్రకటించడం ఆ తర్వాత మొక్కుబడి విచారణలు జరగడం తప్ప రైల్వే వ్యవస్థలో భద్రతను పెంచేందకు తీసుకుంటున్న చర్యలు నామమాత్రంగానే ఉంటున్నాయి. రైలు ప్రయాణం 'దైవాధీనం' అన్నట్లుగా మారిందనడానికి ఇటీవల కాలంలో జరిగిన ప్రమాదాలే ఇందుకు ప్రత్యక్ష నిదర్శనాలు. రైల్వేలో ఆధునీకరణ జరగకపోవడం, పాతకాలపు బోగీలు, సిగ్నలింగ్ వ్యవస్థలో లోపాలు, తగినంత సిబ్బంది లేకపోవడం వంటివి ప్రమాదాలకు కారణమవుతున్నాయి. దీంతో రైలు ప్రమాద సంఖ్య ఏటేటా పెరుగుతోంది. ప్రమాదాల విషయమై తగు సూచనలు, సిఫార్సులు చేసేందుకు భారతీయ రైల్వేలో ప్రత్యేకంగా 'రైల్వే భద్రతా కమిషన్' (సీఆర్ఎస్) ఉంది. రైలు ప్రమాదాలను అధ్యయనం చేసి నివేదికలు ఇవ్వడంలో ఈ కమిషన్ అంతు లేని జాప్యం చేస్తోందన్న విమర్శలున్నాయి. ఒకవేళ నివేదికలు సమర్పించినా వాటిలోని సూచనలు అమలు చేసేందుకు ఎంతో కాలయాపన జరుగుతోంది. గత ఏడాది ఇండోర్ - రాజేంద్రనగర్ ఎక్స్‌ప్రెస్ ప్రమాదానికి గురై 146 మంది ప్రయాణికులు మరణించగా ఆ ఘటనపై రైల్వే భద్రతా కమిషన్ నివేదిక ఇప్పటికీ వెలుగు చూడలేదు. రైలు ప్రమాదాల్లో విద్రోహ కోణం కూడా ఉండవచ్చన్న అనుమానాలు ఏర్పడుతున్నందున ఇటీవల 'జాతీయ దర్యాప్తు సంస్థ' (ఎన్ఐఎ) కూడా విచారణ చేపడుతోంది. సాంకేతిక సమస్యలతో పాటు ప్రయాణీకుల అభిప్రాయాలను పరిగణనలోకి తీసుకొని నివేదికలు ఇవ్వడంలోనూ జాప్యం జరుగుతున్నది. రైలు ప్రమాదాలపై పార్లమెంటరీ కమిటీ కూడాపలు సందర్భాల్లో ఆందోళన వ్యక్తం చేసింది. గత ఆరేళ్ళతో పోల్చి చూస్తే 2016లో రైలు ప్రమాదాల సంఖ్య విపరీతంగా పెరిగిందని రైల్వే బోర్డు సైతం అంగీకరిస్తుంది. రైల్వేట్రాక్‌కు సంబంధించి నాణ్యతా ప్రమాణాలు సంతృప్తికరంగా లేవని ఈ కమిటీ గతంలోనే ప్రకటించింది. రైల్వేలో భద్రత, రక్షణ తీరు ఆందోళనకరంగానే ఉన్నట్లు కమిటీ సభ్యులు అభిప్రాయ పడ్డారు. ట్రాక్‌విషయంలో నాణ్యత ప్రమాణాలను విధిగా పాటించాలంటూ గత నెలలో లోక్‌సభకు స్టాడింగ్ కమిటీ తన నివేదికను కూడా సమర్పించింది.

## మానవ తప్పిదాలే ప్రమాదాలకు అసలు కారణాలు...

రైల్వేలో పని ఒత్తిడికి తగ్గట్టుగా సిబ్బంది నియామకం జరగడం లేదు. గ్యాంగ్‌మెన్ల నుంచి డ్రైవర్ల వరకు అన్ని పోస్టులోనూ సిబ్బంది కొరత వెంటాడుతోంది. కొన్నేళ్లక్రితం ఏర్పాటు చేసిన అనిల్ కిర్లోస్కర్ కమిటీ ఈ విషయాన్ని ప్రత్యేకంగా ప్రస్తావించింది. సిబ్బంది కొరతను తక్షణమే

తీర్చాలని సిఫార్సు చేసింది. అయితే ఆ దిశలో కేంద్ర ప్రభుత్వం తీసుకున్న చర్యలు నామమాత్రమే. బడ్జెట్‌లో ప్రచారానికి వచ్చే పనికి వచ్చే పనులకోసం కేటాయించే నిధులపై తీసుకుంటున్న శ్రద్ధ భద్రత ప్రమాణాల పెంపునకు ఆసక్తి చూపకపోవడంతో ఈ పరిస్థితి ఏర్పడుతుంది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాన్ని దిగువస్థాయి సిబ్బందికి బదిలీ చేయడంలోనూ తీవ్ర వైఫల్యం ఉంది,. అనుమానాస్పద పరిస్థితి కనపడితే గ్యాంగ్‌మెన్లు కిలోమీటర్ల కొద్దీ పరుగెత్తి ఆ విషయాన్ని పై అధికారులకు తెలియజేసే దుస్థితి దేశంలోని కొన్ని ప్రాంతాల్లో ఇంకా కొనసాగుతుందంటే ఆశ్చర్యం కలుగుతుంది. ఇంజన్ల ఆధునీకరణ, నూతన సాంకేతిక ఆవిష్కరణలకు తగినట్లుగా బోగీలు మార్చడంవంటి చర్యలుకూడా అంతంత మాత్రమే. రైళ్ల నిర్వహణ లోపం డ్రైవర్ నిర్లక్ష్యం కూడా ప్రమాదాలకు దారి తీస్తోంది. రైలు బయలుదేరే ముందు స్టేషన్ సమీపంలోని పిట్ లైన్స్‌లో క్షుణ్ణంగా తనిఖీచేస్తారు, ఎలక్ట్రానిక్, మెకానిక్ మెయింటెనెన్స్ విభాగాలకు చెందిన నిపుణులు ఈ తనిఖీలో పాల్గొంటారు. ఆ తర్వాత రైలు గార్డుకు సంబంధిత రైలు సురక్షితమని ఓ సర్టిఫికేట్ ఇస్తారు. ఆ తర్వాతే బండి బయలుదేరి వెళుతుంది.

రైలు గమ్యస్థానం చేరుకున్న తర్వాత రైలు పెట్టెలను నిర్ణీత కాలంలో ఒకసారి పూర్తి స్థాయిలో తనిఖీలు చేయాలి. అలాగే ఏడాదికొకసారి పాత పెట్టెలను, రెండేళ్లకు ఒకసారి కొత్త రైలు పెట్టెలను ఓవర్‌హాలింగ్ చేయాలి. ఓవర్ హాలింగ్ అంటే సాధారణ వాహనాలకు చేసే సర్వీసింగ్ వంటిది. సిబ్బంది కొరత కారణంగా ఓవర్ హాలింగ్ సక్రమంగా చేయడంలేదు. ఇలాంటివేవి జరగకపోవడం ప్రమాదాలు తరచుగా చోటుచేసుకుంటున్నాయి. రైలు ప్రమాదాలకు ప్రధాన కారణం మానవ తప్పిదాలే. దేశంలోనే అతి పెద్ద వ్యవస్థగా ఘనత వహించిన మన రైల్వే శాఖలో అవసరానికి సరిపడ ఉద్యోగులు లేరు. 14 లక్షల మంది ఉద్యోగులతో కళకళలాడాల్సిన రైల్వే శాఖ ఇప్పుడు కేవలం 10 లక్షల మంది ఉద్యోగులతో సరిపెట్టుకోవాల్సి వస్తోంది. ఫలితంగానే నిర్వహణను గాలికొదిలేస్తున్నారు. వాస్తవానికి బిజీ రూట్లలో పగటివేళల్లో నాలుగు గంటలకోసారి ట్రాక్‌ను పరిశీలించాల్సి ఉంటుంది. రాత్రి పూటయితే ప్రతిగంటకు తనిఖీ చేయాలి. ఈ తనిఖీలు లేకపోవడం వల్ల పట్టాలపై పరుగెత్తాల్సిన రైలు పట్టాలు తప్పుతోంది.

### రాత్రి సమయంలో ఎక్కువ ప్రమాదాలు..

అత్యధిక రైలు ప్రమాదాలు రాత్రి పూట జరుగుతుంటాయి. అర్ధరాత్రి దాటిన తర్వాత దాదాపు రెండు గంటల సమయం నుంచి తెల్లవారు జాముున ఉదయం ఆరు గంటల మధ్య అత్యధికంగా భారీ ప్రమాదాలు జరుగుతుంటాయి. 88 శాతం అగ్ని ప్రమాదాలు ఈ సమయంలో జరుగుతుంటాయి. ఒక అధ్యయనం ప్రకారం రాత్రి ఎనిమిది గంటల నుంచి తెల్లవారు జామున రెండుగంటల వరకు 42 శాతం ప్రమాదాలు జరుగుతుండగా రాత్రి ఏడు గంటల నుంచి ఉదయం ఏడు గంటల వరకు 40 శాతం ప్రమాదాలు జరుగుతుంటాయని తేలింది. ఉదయం ఏడు గంటల నుంచి సాయంత్రం ఐదు గంటల వరకు కేవలం 9 శాతం ప్రమాదాలు మాత్రమే జరుగుతుంటాయని వెల్లడించింది.

### అగ్ని ప్రమాద యంత్రాల లేమి...

బోగీలకు నిప్పంటుకోకుండా ఉండాలంటే ఏం జాగ్రత్తలు తీసుకోవాలో భారతీయ రైల్వేల చట్టం సెక్షన్ 67లో క్లుప్తంగా ఉంది. చిన్నచిన్న షాపింగ్‌సెంటర్లలోనూ అగ్నిమాపక యంత్రాలుంటున్నాయి. కానీ నిత్యం వేల మంది ప్రయాణికులను గమ్యానికి చేర్చే రైల్వేలో మాత్రం వాటి ఉనికే ఉండదు. ఒకటి ఆరా రైళ్లల్లో పొగను, నిప్పును గుర్తించే అలారంలను ఏర్పాటుచేస్తున్నారు.

## కొన్ని భారీ ప్రమాదాలు

* 2002 సెప్టెంబర్ 9న హౌరా – న్యూఢిల్లీ రాజధాని ఎక్స్‌ప్రెస్ ప్రమాదం రఫీగంజ్, డెహ్రీ స్టేషన్ల మధ్య చోటుచేసుకుంది. సుమారు 140 మంది చనిపోయారు.
* 2004 డిసెంబర్ 14న జమ్ముతావి ఎక్స్‌ప్రెస్ ప్రమాదంలో 36 మంది మృతి చెందారు.
* 2005 అక్టోబర్ 29న రేపల్లె – సికింద్రాబాద్ డెల్టా ప్యాసింజర్ నల్గొండ జిల్లా వలిగొండ వద్ద పట్టాలు తప్పిన ప్రమాదంలో 100 మంది మృతి చెందారు.
* 2005 నవంబర్ 26న మండోవి ఎక్స్‌ప్రెస్ ప్రమాదంలో వంద మంది మృతి చెందగా 500 మందికి పైగా తీవ్ర గాయాలకు గురయ్యారు.
* 2006 జులై 11న కమ్యూటర్ ట్రెన్‌లో ముంబాయి సబర్బన్ రైల్వే వరుస బాంబుల పేలుళ్లు, స్టైకల వల్ల సుమారు 200 మంది మృతి చెందారు.
* 2006 నవంబర్ 6న పశ్చిమ బెంగాల్ రైలు ప్రమాదంలో 40 మంది మృతి చెందారు.
* 2006 డిసెంబర్ 1న బీహార్ – భగల్‌పూర్‌లో గంగాపై నిర్మించిన 150 ఏళ్ల చరిత్ర కలిగిన అల్టాపుల్ రైల్వే బ్రిడ్జి కూలిన ప్రమాదంలో 35 మంది మృతి చెందారు.



* 2008 జులైలో గౌహతి ఎక్స్‌ప్రెస్ షార్ట్ సర్క్యూట్ ప్రమాదంలో 40 మంది మృతి చెందారు.
* 2010 మే 28న జ్ఞానేశ్వరి ఎక్స్‌ప్రెస్ పట్టాలు తప్పిన ప్రమాదంలో 170 మంది చనిపోయారు.
* 2010 జులై 19న ఉత్తరబంగా ఎక్స్‌ప్రెస్ వనన్చల్ ఎక్స్‌ప్రెస్ ఢీకొన్న ప్రమాదంలో 63 మంది మృత్యువాత పడ్డారు.
* 2011 జులై 10న ఉత్తరప్రదేశ్‌లో కల్కా మెయిల్ పట్టాలు తప్పడంతో 70 మంది మృతి చెందారు.
* 2012 జులై 30న తమిళనాడు ఎక్స్‌ప్రెస్ (న్యూఢిల్లీ – చెన్నై) అగ్ని ప్రమాదంలో 47 మంది చనిపోయారు.
* 2013 డిసెంబర్ 28న బెంగుళూరు సిటీ – హజూర్ సాహెబ్ నాందేడ్ ఎక్స్‌ప్రెస్ ఏసీ బోగీ అగ్ని ప్రమాదంలో 26 మంది మృతి చెందారు.
* 2014 మే 26న గోరఖ్‌పూర్ ఎక్స్‌ప్రెస్ ప్రమాదంలో 25 మంది చనిపోగా 50 మందికి పైగా గాయపడ్డారు.
* 2015 మార్చి 20న డెహ్రాడూన్ – వారణాసి జనతా ఎక్స్‌ప్రెస్ పట్టాలు తప్పిన ప్రమాదంలో 39 మంది చనిపోయారు.
* 2015 నవంబర్ 21న ఇండోర్ – పాట్నా ఎక్స్‌ప్రెస్ పట్టాలు తప్పడంతో 125 మంది మృతి చెందారు.

అయితే అవి కేవలం ఇంజన్‌లకే పరిమితం అవుతున్నాయి. వాటిని బోగీల్లోనూ ఏర్పాటు చేస్తే ఫలితం ఉంటుంది. అయితే అక్కడక్కడ రైల్వేకోచ్‌లలో డ్రై కెమికల్ పౌడర్‌తో కూడిన అగ్నిమాపక యంత్రాలు మాత్రమే ఏర్పాటు చేశారు. ఇవి కూడా ఇంజన్లు, గార్డు వ్యాన్లు, పాంటీ కార్లు, ఎసీ కోచ్‌లలో మాత్రమే కనిపిస్తాయి. కోచ్‌లలో ఏదైనా పొగ అలుముకున్నట్లు, మంటలు చెలరేగినప్పుడు మాత్రమే వీటిని ఉపయోగిస్తారు. రైళ్లు పరుగులు తీసే సమయంలో ఏదైనా పొగవస్తే పసిగట్టి హెచ్చరికలు జారీచేసే వ్యవస్థ ఇంతవరకు విజయవంతం కాలేదు. మంటలు చెలరేగినప్పుడు రైలును తక్షణం నిలిపివేయడం అత్యంత ప్రధానమైన అంశం. అందువల్ల అగ్నిమాపక సంకేత వ్యవస్థను రైలుకు బ్రేకులు వేసే వ్యవస్థతో అనుసంధానం చేయాల్సి ఉంది. రైళ్లల్లో అత్యవసర కిటికీలనుంచి దూకడం అంత సులభం కాదని దీని దృష్ట్యా ప్రతి కోచ్‌లో మడత పెట్టే నిచ్చెనలను శాశ్వత ప్రతిపాదికన ఏర్పాటుచేయాలి. అనిల్ కకోద్కర్ కమిటీ చేసిన ఈ సూచనలను సైతం రైల్వేశాఖ అటకెక్కించింది. సిఫార్సులను ఆటకెక్కిస్తున్న రైల్వేశాఖ మాత్రం ఏటా భద్రతా సుంకం పేరుతో వేల కోట్ల రూపాయలను వసూలు చేస్తున్న రైల్వేశాఖ ఆ విషయాన్ని మర్చిపోతుండడం మనం చేసుకున్న దౌర్భాగ్యం.

## పటిష్టమైన బోగీలు నామమాత్రం...

దేశంలో కొన్నేళ్ళుగా దేశీయ పరిజ్ఞానంతో ఇంటిగ్రెల్ కోచ్‌లను తయారుచేస్తున్నారు. వీటిలో ఒకచోట ప్రమాదం జరిగితే కోచ్‌లోని మిగిలిన భాగానికి మంటలు వ్యాప్తించకుండా నిరోధించే గుణం లేదు. అతివేగంగా వెళ్లే రైలు ప్రమాదానికి గురైనప్పుడు బోగీలు తిరగబడే ప్రమాదం ఉంది. దీనివల్ల ఆయా బోగీలు నుజ్జునుజ్జు అవుతున్నాయి. దీంతో పెద్ద ఎత్తున ప్రాణనష్టం కూడా జరుగుతోంది. ఈ పరిస్థితిని అధిగమించేందుకు జర్మన్ పరిజ్ఞానంతో లింగ్ హాఫ్‌మెన్ బాన్స్ కోచల్ (ఎల్‌హెచ్‌బీ)ల తయారీని భారత రైల్వే మొదలు పెట్టింది. వీటిని అగ్నిని నిరోధించే గుణముంది. అతి దృఢంగా ఈ బోగీలుండడం వల్ల భారీప్రమాదం జరిగినా కూడా ధ్వంసంకాకుండా ఉంటాయి. దీనివల్ల ప్రాణనష్టాన్ని కూడా నివారించే అవకాశముంది. దక్షిణ మధ్య రైల్వేలో సుమారు 15వేలకు పైగా బోగీలుండగా ఎల్‌హెచ్‌బీ బోగీల సంఖ్య నామమాత్రంగా ఉంటుంది. వీటి తయారీకి రైల్వేశాఖ ప్రత్యేక చర్యలను తీసుకునేందుకు ఎలాంటి ఆసక్తిని కనబర్చడం లేదు. దీంతో ప్రమాదాల వల్ల ప్రాణనష్టం తీవ్రత మరింత పెరుగుతుంది. ప్రమాదాల తీవ్రతను తగ్గించే అవకాశం ఉన్నా రైల్వేశాఖ ఆ దిశగా అడుగులు వేయకపోవడం విచారకరం.



## పట్టాలు తప్పడంతోనే అత్యధిక ప్రమాదాలు

అత్యధిక భాగం రైలు ప్రమాదాలు పట్టాలు తప్పడం కారణంగా జరుగుతున్నాయి. ఈ తరహా ప్రమాదాలు 40 నుంచి 45 శాతం వరకు ఉంటాయని అంచనా. రెండవ స్థానంలో లెవెల్ క్రాసింగ్ వల్ల జరిగే ప్రమాదాలు ఉన్నాయి. ఇవి 39 నుంచి 42 శాతం వరకు ఈ తరహా ప్రమాదాలు జరుగుతున్నాయి. మృతుల సంఖ్య సాధారణంగా లెవెల్ క్రాసింగ్ వల్ల జరిగే ప్రమాదాల్లోనే అత్యధికంగా ఉంటుంది. 2014- 15 లెక్కల ప్రకారం 47 శాతం ప్రమాదాలు రైలు పట్టాలు తప్పడం కారణంగానే జరిగాయని అధికారక లెక్కల సారాంశం. 41 శాతం లెవెల్ క్రాసింగ్‌ల వల్ల జరగగా, 4 శాతం అగ్ని ప్రమాదాలు జరిగాయి.

## పట్టాలు తప్పడానికి పగుళ్లే కీలకం..

రైలు పట్టాలు తప్పడానికి పట్టాల్లో ఏర్పడే పగుళ్లే కీలకం. అయితే వీటిపై నిరంతర తనిఖీలుండడంతోపాటు డ్రైవర్లు సైతం అప్రమత్తంగా ఉండాల్సి వుంటుంది. రైలు పట్టాల నిర్వహణ బాధ్యత పూర్తిగా ఇంజనీరింగ్ విభాగానిదే. దిగువ స్థాయి సిబ్బంది గస్తీ నిర్వహిస్తూ పగుళ్ళను గుర్తించాలి. పర్మనెంట్ వే తనిఖీదారులు, ఇతర సిబ్బంది పట్టాల తనిఖీలు నిర్వహిస్తుంటారు. రద్దీ ఎక్కువగా ఉండే ప్రాంతాలలో రెండు నెలలకోసారి అల్ట్రాసోనిక్ పరీక్షలు నిర్వహించి పగుళ్లను గుర్తిస్తుంటారు. దీనివల్ల చిన్నపాటి పగుళ్లను గుర్తించవచ్చు. తనిఖీల తర్వాత ఒకవేళ పెద్ద పగుళ్లు ఏర్పడితే అసాధారణ ధ్వని వస్తుంటుంది. వీటిని ఇంజన్ డ్రైవర్లు గుర్తించి దీని గురించి తర్వాత వచ్చే స్టేషన్ మాస్టర్‌ను అప్రమత్తం చేస్తారు. సమస్యను సరిదిద్దే వరకు ఆ సెక్షన్‌లో కాషన్ ఆర్డర్ జారీ చేసి రైళ్ల వేగాన్ని తగ్గిస్తారు. వాతావరణ మార్పుల వల్ల పట్టాల్లో అనేక సమస్యలు కలుగుతాయి. వాతావరణంలో కలిగే అసాధారణమైన పరిస్థితుల వల్ల పట్టాల్లో పగుళ్లు ఏర్పడతాయి. వేసవికి వేడిమి వల్ల, శీతాకాలంలో పట్టాలు కుచించకపోవడం వల్ల, పట్టాల్లో పగుళ్లు ఏర్పడుతాయి. దేశంలో రైలుపట్టాలను స్టీల్ ఆథారిటీ ఆఫ్ ఇండియా సరఫరా చేస్తుంది. ఇందులో అత్యధికంగా భిలాయ్ ఉక్కు కర్మాగారం నుంచే వస్తున్నాయి. నిర్దేశిత ప్రమాణాల ప్రకారం వీటిని దృఢంగా తయారు చేస్తారు. నిర్వహణ సరిగా లేకపోవడంతో పాటు ఫిట్టింగ్, వెల్డింగ్ లోపాలు, పట్టాల కింద వేసే కంకరలో తేడాలు, బురదను పంపింగ్ చేసే వ్యవస్థగా సరిగా లేకపోవడం వల్ల పట్టాలు పగుళ్ల ఏర్పడతాయి.

## నివారణ చర్యలు..

రైలు ప్రమాదాలు జరిగినప్పుడు స్పందించడం తప్ప ప్రమాదాలు జరగకుండా నివారణ చర్యలు తీసుకోవడంలో పాలకులు పూర్తిగా విఫలమవుతున్నారు. ప్రమాదాలు సంభవించినప్పుడు మరణించిన వారితో పాటు గాయాలైన వారికి ఎక్స్‌గ్రేషియా ప్రకటించి చేతులు దులుపుకోవడం మినహా ఎలాంటి చర్యలు తీసుకోవడం లేదు. రైలు ప్రమాదాల పట్ల ఇటు ప్రభుత్వంతో పాటు రైల్వే బోర్డు కూడా ఎలాంటి చర్యలు తీసుకోవడం లేదు. దీనిపై దేశవ్యాప్తంగా చర్చ జరగాల్సి వుంది. ప్రమాదాలకు ముందుగా బాధ్యత వహించాల్సింది ప్రభుత్వమే. రైల్వేలను విస్తరించకుండా, సాంకేతికతను అభివృద్ధి పరచకుండా తన విధానాలను మాత్రమే ముందుకు తీసుకెళ్తుంది. ఇది కాకుండా ప్రమాదాలను నివారించేందుకు తక్షణంగా రైల్వేలోని ఖాళీలను భర్తీ చేయాలి. ప్రధానంగా భద్రతా విభాగంలోని అన్ని రకాల పోస్టులను నింపాలి. రైల్వే లైన్లను, పట్టాలను క్రమం తప్పకుండా మార్చాలి. బ్రిటిష్‌కాలం నాటి బ్రిడ్జిలు, లైన్లనే ఇప్పటికీ వాడుతున్న పరిస్థితి తక్షణమే మెరుగుపర్చాలి. పెరిగిన రద్దీకి అనుగుణంగా కొత్త రైళ్లను నడపాలి. అందుకవసరమైన కోచ్‌లను ప్రమాద రహితమైన పద్ధతిలో తయారు చేయాలి. ప్రస్తుతం ఉన్న కోచ్‌ల స్థానంలో ఎల్‌హెచ్‌బి కోచ్‌లను తీసుకు రావాలి. ప్రతి రైలును పంపించే ముందు క్షుణ్ణంగా తనిఖీలు చేయాలి. తనిఖీలకు వీలుగా వర్క్‌షాపులు, సిబ్బందిని నియమించాలి. ఎక్కువ కాలం ఉపయో గించిన ట్రాక్‌లను, కోచ్‌లను మార్చాలి,. క్రమం తప్పకుండా రెన్యువల్స్ చేయాలి. రూట్ రిల్ ఇంటర్ లాకింగ్ వ్యవస్థను ఆధునీకరించాలి. ప్రతి ట్రైన్‌ను టెక్నీషియన్స్ పరీక్షించడానికి 6 గంటల సమయం ఉండేలా షెడ్యూల్‌ను మార్చాలి. గ్యాంగ్‌మెన్‌పై భారాన్ని తగ్గించాలి. సూక్ష్మ పగుళ్ళను గుర్తించే ఆధునాతన స్కానర్స్‌ను అందుబాటులో ఉంచాలి. ఇందుకోసం రైల్వేలను ప్రజా రవాణా సంస్థగా ప్రభుత్వం గుర్తించాలి. సమీప భవిష్యత్తులో మన రైల్వే పరిస్థితి మెరుగుపడుతుందని ఆకాంక్షిద్దాం. ■

# జంతురక్షణలో నిరంతరం..

సహృదయతకు మారుపేరు షాలినీ అగర్వాల్. బరేలీ నివాసి అయిన షాలిని ప్రస్తుతం తన రెండు పడకగదుల ఫ్లాట్‌లో 46 వేర్వేరు జంతువుల ఆలనా పాలనా చూస్తోంది. తమ నగరంలో ఎక్కడ గాయపడ్డ జంతువును తానే చూసినా లేదా ఎవరైనా ఆ సంగతి తెలియజేసినా వెంటనే రంగంలోకి దిగి ఆ జంతువుకు తగిన చికిత్స చేయించి, చేరదీస్తుంది. ఆమెకు ఎవరైనా ఫోన్ చేస్తే చాలు. నేపథ్యంలో పక్షుల కూతలు, కుక్కల భౌభౌలు వినిపిస్తూనే ఉంటాయి. ఆమె పెంచుతున్న జంతువుల్లో ఓ పిల్ల గుర్రం కూడా ఉండటం విశేషం.



ఇంతకూ ఆమెలో జంతుకారుణ్యం అంతగా పాదుకోవటానికి కారణం ఆమె తండ్రి జంతుప్రేమికుడు కావడమే. షాలిని బాల్యంలో తన తండ్రి వీధుల్లో గాయపడ్డ జంతువుల్ని ఇంటికి తీసుకురావడం, వాటికి సపర్యలు చేసి, పెంచటం దగ్గరగా చూసింది.ఆ ప్రభావం ఆమెపై గాఢంగా పడింది.

షాలిని నివసించే అపార్ట్‌మెంట్ ఓ చిన్ని జంతురాజ్యంగా ఉంటుంది. కుక్కలు, పక్షులు, మూడునెలల వయసు గుర్రం, పిల్లులు, ఒక కోతి వగైరాలున్నాయి. షాలిని ఇరవయ్యేళ్లుగా జంతు సంక్షేమానికి పాటుపడుతోంది.ఆమె ఇరుగుపొరుగులు కూడా నగరంలో గాయపడ్డ జంతువుల గురించిన సమాచారాన్ని ఆమెకు అందిస్తారు. అంతే. ఆమె వెంటనే వాటి రక్షణకు సిద్ధమవుతుంది. వాటిని ఇంటికి తీసుకువచ్చి అత్యవసర వైద్యం చేస్తుంది. అవసరమయితే వెటర్నరీ డాక్టర్ వద్దకు తీసుకువెళ్తుంది.

సమాజంలో ఎన్నో రకాల జంతుహింసను ఆమె ఎన్నో ఏళ్లుగా చూస్తోంది. ఐదేళ్ల కిందట ఆమె వేరు ప్రాంతంలో ఉండేది. అక్కడ ఉండగా డైజీ అనే ఓ వీధికుక్కకు రోజూ ఆహారం అందించేది. అది ఎంతో బుద్ధిగా, నిశ్శబ్దంగా ఉండేది. కేవలం ఆహారం వేళకు మాత్రం షాలిని ఇంటికి వచ్చేది. కానీ గర్భంతో ఉన్న డైజీకి ఎవరో కావాలని విషం పెట్టారు. ఆ సంఘటన షాలినిని కలచివేసింది. షాలిని ఎఫ్ఐఆర్ ఫైల్‌చేసింది. ఆ సంఘటన షాలినికి జంతు కారుణ్యంపై అంకిత భావాన్ని మరింత పెంచింది. 'మెర్సీ ఫర్ ఆల్' పేరిట ఒక ఎన్‌జిఒను ప్రారంభించి రిజిష్టర్ చేసింది. ఈ సంస్థ ఆపదలో, అనారోగ్యంలో ఉన్న జంతువులను కాపాడడంతో ఆటు, ఫిర్యాదులను ఫైల్‌చేయటం, వెటర్నరీ డాక్టర్లను ఆయా జంతువుల విషయమై సంప్రదించడం మొదలైన పనులు చేస్తుంది. సంస్థ ద్వారా అధికారులతో సంప్రదింపులు కూడా మరింత సులభం, ప్రభావవంతం అయ్యాయి.





'నేను జంతువులను రక్షించడం మొదలుపెట్టినప్పుడు వాటిని ఉంచడానికి నాకు ప్రత్యేకమైన స్థలం ఏదీ లేదు. పెద్ద జంతువులను మునిసిపల్ షెల్టర్‌లలో చేర్చాల్సి వచ్చేది లేదంటే ఎవరైనా పెంచుకుంటామంటే వారికి ఇవ్వవలసి వచ్చేది. కానీ చిన్న జంతువుల విషయంలో వేర్వేరు షెల్టర్లకు వెళ్లటం అసాధ్యంగా ఉండేది. వాటన్నిటికీ వైద్య సహాయం అవసరమయ్యేది. కొన్ని జంతువులకు సర్జరీ కూడా చేయవలసి వచ్చేది. అందుకే నేను వాటిని మా ఇంటికే తీసుకువెళ్లి, ఉత్తమ వైద్య సేవలందించటం మొదలుపెట్టాను' అంటుంది. క్రమంగా నా దగ్గర చేరే జంతువుల సంఖ్య పెరిగిపోయింది. ఆమె పెంచే జంతువులు ఆమె ఫ్లాట్‌లోనే ఉంటాయి. బయట తిరగాలనుకునే కుక్కలు మొదలైన జంతువులు కూడా కొంతసేపు బయటకు వెళ్లినా తిరిగి ఆమె ఫ్లాట్‌కే వస్తాయి.

అయితే షాలిని కేవలం కుక్కపిల్లలు, పిల్లి పిల్లలకే పరిమితం కాలేదు. ఇటీవల ఆమె ప్రమాదంలో చిక్కుకున్న ఓ ఎద్దును కాపాడింది. ఎవరో స్మగ్లర్లు ఆ ఎద్దును పట్టుకెళ్లడానికి ప్రయత్నించారు. అందులో భాగంగా దాని తలకు, కొమ్ముల వద్ద ఇనుప కొక్కేలవంటివి కొట్టారు. ఫలితంగా ఎద్దుకు అయిన గాయాలు ఇన్‌ఫెక్షన్‌కు గురైన పరిస్థితిలో షాలినికి ఆ సమాచారం తెలిసింది. గాయాల బాధలో ఉన్న ఆ ఎద్దు మరింత కోపంగా ఉంది. ఆ సంగతి చెపుతూ 'మొదటిసారి దాన్ని చూసినపుడు నాకు భయం వేసింది..కారణం అది ఎంతో కోపంగా దాడిచేయడానికి ప్రయత్నిస్తోంది. వెంటనే నేను డెయిరీలో పనిచేసే 16మంది వలంటీర్లను పిలిపించాను. వారికి అటువంటి ఎడ్లను ఎలా మచ్చిక చేసుకోవాలో బాగా తెలుస్తుంది. వారు ఉపాయంగా దాన్ని బంధించి, దాని తలనుండి ఆ కొక్కేలను తొలగించి, గాయాలకు మందువేశారు. దానికి చికిత్స చేసి, ఆహారం అందించగానే అది సాత్వికంగా తల వంచి నిలబడింది. అప్పుడనిపించింది నా పని నిజంగా ఎంత ప్రమాదంతో కూడుకున్నదో అని'.

జంతువులంటే భయం, చిరాకు ఉన్నవారి ఆందోళనను, సందేహాలను షాలిని చక్కగా అర్థంచేసుకుంటుంది. అందుకే వారికి సందేశమిస్తూ..'కుక్కలు వాటి జోలికి వెళ్లి, వాటిని గాయపరిస్తే తప్ప అవి మనుషుల్ని గాయపరచవు. జంతువులకూ మనుషుల్లాగే ఫీలింగ్స్ ఉంటాయి. నేను ఈ రంగంలో ఇరవై ఏళ్లుగా పనిచేస్తున్నాను. ఇంత వరకూ ఏ జంతువూ నన్ను గాయపరచలేదు. మీ మనసు మంచిదైతే అవి మిమ్మల్ని గాయపరచవు' అని.

జంతురక్షణకే అంకితమైన షాలిని వాటికి ఆహారం, మందులు, చికిత్స, ఇతర అవసర వస్తువులు..వీటన్నిటినీ సమకూర్చటానికి తన సొంత డబ్బును ఖర్చుపెడుతుంది. ఆమె స్నేహితులు కొంతమంది కొంత సహాయం అందిస్తారు. అయినప్పటికీ చాలాసార్లు డబ్బు విషయంలో ఇబ్బంది ఎదరవుతూ ఉంటుంది. అందుకే ప్రస్తుతం ఆమె ఇందుకోసం నిధుల సేకరణ చేస్తోంది.

'ప్రతివారికి ఎవరో ఒకరు ఉండాల్సిందే. జంతువులకోసం ఇక్కడ నేను ఉన్నాననుకుంటున్నాను. చాలామంది నా స్నేహితులు, బంధువులు నన్ను కలుసుకోవటం మానేశారు. కారణం నా చుట్టూ జంతువులు ఉండటం వారికి ఇబ్బందికరంగా ఉంటుంది. కానీ నా కుటుంబం మాత్రం ఈ విషయంలో నాకు అడుగడుగునా మద్దతునిస్తోంది. ఆ తోడ్పాటే నన్ను జంతురక్షణకు మరింతగా ప్రేరేపిస్తోంది' అంటుంది షాలిని. ■

కృతి

## సహకార సిబ్బందికి సహాయకారి



సహకార సారథి శీర్షికతో సంపాదయకీయాల సంకలనం నాలుగోభాగం చాలా స్ఫూర్తిదాయకంగా పాఠకులకు ఉత్తేజాన్ని కలిగిస్తుంది. సహకార స్ఫూర్తే ఊపిరిగా, సహకార వ్యవస్థ శ్రేయస్సే లక్ష్యంగా సాగి పోతూ సహకార సారథ్యాన్ని ఎంతో సమర్థవంతంగా సంపాదకులు బ్రహ్మాం గారు రూపొందించారు. సహకార వ్యవస్థలోని సమస్యలు, లోటుపాట్లు, స్పష్టం చేశారు. ఈ వ్యవస్థ సమర్థంగా సాగడానికి నిర్మాణాత్మకమైన సూచనలు అందిం చారు. దేశంలో సహకార వ్యవస్థపై ప్రస్తుతం చిన్నచూపు కొనసాగు తుండడం అత్యంత శోచనీయం. ప్రపంచ సహకార వ్యవస్థలో మన దేశం వాటా దాదాపు ఇరవై శాతం. అలాగే మన దేశ జనాభాలో కూడా ఇరవై నుంచి ఇరవైఐదు శాతం మంది ఏదో ఒక సహకార సంఘంలో సభ్యులుగా ఉండడం విశేషం. ఈ వ్యవస్థ అన్ని గ్రామా లకు చేరువలో ఉంది. కానీ అది వాపే కాని బలుపు కాని విధంగా తయారైంది. ఈ సంపాదకీయాల్లో 2012 అంతర్జాతీయ సహకార సంవత్సర ప్రాధాన్యతను తెలియచేసే సంపాదకీయాలు ఎంతో విలు వైనవి. సహకారసంస్థల్లో పనిచేస్తున్న సిబ్బందికి సహకార సంస్థల సభ్యులు, పాలకవర్గంలోని నాయకులు, ప్రభుత్వ ఉద్యోగులందరికీ ఈ పుస్తకం ఎంతో ప్రయోజనకరమైంది.

**(సహకారసారథి-సంపాదకీయాల సంకలనం, నాల్గవభాగం: సంపాద కులు-పి.వి.బ్రహ్మాం; వెల:రూ.100; ప్రతులకు: ఆం.ప్ర. సహకార బ్యాంకుల అసోసియేషన్ (రి); 3-4-447/448, సహకార భవన్, బర్కత్‌పుర, హైదరాబాద్-27)**

**-పెట్ల వెంకటేశం**

## చక్కని సందేశాత్మక నవల




శరీర నిర్మాణశాస్త్రం ప్రకారం మనుష్యజాతి అంతా ఒక్కటే అయినా మతాలు, కులాలు, వర్గాలు, జాతులు, తెగల పేరిట మనిషికి, మనిషికి మధ్య ఇనుపగోడలు. వీటిని కూల్చాలన్న ప్రయత్నాలకు ఎన్నో ప్రతిబంధకాలు. సర్వమానవ సౌభ్రాతృత్వం బోధించే నవలే సలీం రచించిన 'అనూహ్య పెళ్లి'. సైఫ్ అనే ముస్లిం యువకుడు రాణి అనే బ్రాహ్మణయువతి ప్రేమించుకుంటారు. వీరి కూతురు అనూహ్య. మతాలకతీతంగా అనూహ్యను స్వేచ్ఛగా పెంచుతారు.

అయితే అనూహ్య పెళ్లికి సైఫ్, రాణి ఎంత ఇబ్బందిపడతారో, ఈ సందర్భంలో వారికి ఎదురైన కష్టాలు ఏమిటో, వాటిని ఈ ముగ్గురు ఎంత సమర్థవంతంగా ఎదుర్కొంటారో తెలియజెప్పే నవల ఇది. రచయిత మతపరంగా ముస్లిం, పుట్టిపెరిగిన పరిసరాల పరంగా హిందూ. ఈ రెండు మతాల్లోని వైరుధ్యాల్ని, సారూప్యతను అధ్యయనం చేయటమే కాకుండా తన రచనలో విశ్లేషించారు. సమాజంలోని లొసుగుల్ని, లోపాలనూ ఎత్తిచూపుతూ సందేశాన్నివ్వ గల నేర్పు రచయిత సొంతం. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నిర్వహించిన పోటీలో బహుమతి పొందింది ఈ నవల. మతాంతర వివాహాల సాధకబాధకాలను చక్కగా చిత్రించిన నవల ఇది.

**(అనూహ్యపెళ్లి-నవల: సలీం; వెల: రూ.150; ప్రతులకు: విశాలాంధ్ర బుక్‌హౌస్, అన్ని బ్రాంచీలు)**

**-కూర చిదంబరం**

## సమాజ జాగృతే ధ్యేయంగా..



పర్యావరణ పరిరక్షణ ఆవశ్యకతను ఉద్భోదిస్తూ వైజ్ఞానిక దృష్టితో హరిత భాషను రంగరించి ఆచార్య పసుల వెంకటరెడ్డి వెలువరించిన 73 కవితల సంపుటి 'ప్రకృతి అడుగుజాడల్లో'.

చెట్టు, గుట్ట, పుట్ట, పక్షి, వన్యప్రాణి, అడవి, సముద్రం..ఇలా ప్రకృతిలోని సమస్త అందాలను వర్ణిస్తూ నేడు అది అంతరిస్తున్న క్రమానికి అక్షరరూపం ఇస్తూ అక్కడక్కడా ధర్మాగ్రహం వెలిబుచ్చుతారు. కుటుంబ సంక్షేమం ఎంత ముఖ్యమో/ నాటిన చెట్ల సంక్షేమం అంతే ముఖ్యం/ అప్పుడే హరితహార నినాదం సార్థకం' అని నినదిస్తున్న కవి పర్యావరణాన్ని రక్షించడం భారతదేశ పౌరులందరి కర్తవ్యం' అని ఉద్భోదిస్తారు.

కేవలం హరిత భాషే కాదు..కవిత్వ భాషలో తాత్వికంగా పలువరించిన 'మౌనం'లాంటి కవితలు కూడా జతచేశారు. 'మౌనం అంటే గంభీర సాగరం/ మౌనం అంటే విశాల వినీలాకాశం/ మౌనం ప్రకటించేది/ అప్రకటిత నిశ్శబ్ద యుద్ధమే' వంటి అద్భుత వాక్యాలను ఆస్వాదించవచ్చు. విజ్ఞానశాస్త్ర సూత్రాల్ని మానవ దైనందిన జీవితానికి అన్వయించి జంతుశాస్త్ర అధ్యాపకుడు, పరిశోధకుడు వెలువరించిన ఉపయుక్త రచన ఇది.

**(ప్రకృతి అడుగుజాడల్లో (కవిత్వం): ఆచార్య పసుల వెంకటరెడ్డి; వెలరూ.100; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తకకేంద్రాలు).**

**- రమణ వెలమకన్ని**

## హృద్యమైన పద్యాలు



కాహళి అంటే బాకా..చిన్న బాకా. ఈ పద్య ఖండికసంపుటిలో తేటగీతి, సీసం, కందం, ఉత్పల మాల, మత్తకోకిలలాంటి చంధోబద్ధపద్యాన్ని సామాజి కాంశాలతో రాయడం డా.వూసల రజనీ గంగాధర్ ప్రత్యేకత. తెలుగు పద్యంపై పట్టు ఉన్న ఈ కవి నేటియువత స్థితిని కంద పద్యంలో ఇలా ...

తొలితరము కవులకున్ సరి/ మలి తరమున కవులు కూడా మమతలు పంచక
పలుకరు నేడీ యువకులు/ పలుకుటే నేరము తెలుగని మదిలో దలచున్...

భ్రూణహత్యలపై కవి రాసిన సీస పద్యం పాఠకుల్ని కంట తడి పెట్టిస్తుంది, ఆలోచింపజేస్తుంది..

గర్భస్థ శిశువును కనకముందే కని/ పిండమున్ గ్రూరులై పిప్పిజేయు కాలుజారిన కన్య కన్న ప్రేమను మరచి/పరువుకై పొదలలో పారవైచు ఎదిగి వచ్చినయంత ఎట్లు పెండ్లి యనుచు/కట్నమీయగలేక కాసుకమ్ము/ ఆడదైయుండియు ఆడదానికి జన్మ/ నీయగ మనసున నిష్టపడదు.. అంటారు. ఆంధ్రకేసరి, రాయల యుగం, పాములపర్తి, రైతు భారతంలాంటి అంశాలపై రాసిన పద్యాలు ఎంతోబాగున్నాయి. ఛందస్సు పద్యానికి ఒక తూగును, లయను, యతిప్రాసలు..శబ్ద సామరస్యాన్ని కలిగిస్తాయి. యతిమైత్రి కూర్పు అభినందనీయం.

**(కాహళిక:పద్యఖండికల సంపుటి: డా.వూసల రజనీగంగాధర్; వెల: రూ.120; ప్రతులకు: అన్ని ప్రముఖ పుస్తక విక్రయకేంద్రాలు)**

**-తంగిరాల చక్రవర్తి**




# నీలి పుష్పం!

కస్తూరి మురళీకృష్ణ

**ఎస్సా మక్వోజి ప్రాంతంలో స్థిరపడిన తెగలన్నిటిలోనే సుందరమైన యువతిగా ఆమె ప్రసిద్ధిచెందింది. ఆమె అసలు పేరు ఎవ్వరికీ తెలియదు. అందరూ ఆమెని 'నీలి పుష్పం' అంటారు.**

**(ఉత్తర అమెరికా ఈశాన్య ప్రాంతంలో ఏస్సా మక్వోజి నదీతీర ప్రాంతంలో నివసించే తెగలను 'ఏస్సా మక్వోజి' తెగలంటారు. వీరు ఆమెరికా ప్రాంతానికి స్థానికులు. యూరోపియన్లు వచ్చి వీరిని ఆయాప్రాంతాల నుండి తరిమివేశారు. వీరిని అసలైన అమెరికన్లుగా భావిస్తారు)**

'నీలిపుష్పం' అన్న పేరున్న ఆ అమ్మాయిని ఆకర్షించాలని దూరదూర తెగల నుండి ఎందరెందరో యువకులు ఆ ప్రాంతానికి వచ్చేవారు.

ఆమె ఇంటి ముందు రకరకాల విన్యాసాలు చేసేవారు.

ఆ తెగలో యువతి ఇంటి ముందుకు వచ్చి యువకుడు తన ప్రావీణ్యాన్ని, తన ప్రత్యేకతను ప్రదర్శిస్తాడు. అది నచ్చితే అమ్మాయి అతడిని స్వీకరిస్తుంది. లేకపోతే తిరస్కరిస్తుంది. ఇక మళ్లీ ఆ యువకుడు ఆ ఇంటి ముందుకు రాకూడదు.

అలా ఎందరో ఆమె ఇంటిముందుకు వచ్చారు. పలురకాల విన్యాసాలు చేశారు. ఆమె అందంవైపు ఆశగా చూస్తూ ఆమె అంగీకారం కోసం ఎదురుచూశారు. కానీ ఆమెనుంచి అంగీకారం అందకపోవటంతో నిరాశతో వెనుతిరిగారు. ఎంతకీ ఆమెనుంచి అంగీకారం అందకపోవటంతో ఆమె పట్ల ఆసక్తి పెరిగింది. ఆసక్తి ఎంత పెరిగితే అంతగా దూరదూరాలు ఆమె అందం ఖ్యాతి వ్యాపించింది.

ఎంతదూరం ఆమె ఖ్యాతి వ్యాపిస్తే అంతగా యువకులు ఆ ప్రాంతానికి వచ్చేవారు. వారెవరినీ ఆమె మెచ్చేదికాదు. దాంతో మరింతగా ఆమె ఖ్యాతి వ్యాపించేది. ప్రతిరోజూ ఉదయం ఆమె ఇంటిపైన వచ్చి నిలబడేసరికి ఇంటిముందు యువకుల గుంపు నిలబడి ఉండేది. ఆమె వచ్చేసరికి వారిలో వారు ఎవరుముందు తమ నైపుణ్యాన్ని ప్రదర్శించాలో నిర్ణయించుకునేవారు. చాలాకాలం ఇలా జరుగుతూండటంతో నెమ్మదిగా యువకులలో నిరాశ పెరిగిపోయింది. 'నీలిపుష్పం' అలా అనాఘ్రాతంగా వాడిపోతుంది తప్ప ఎవరి దరిని చేరదు' అన్న నమ్మకం కలిగింది. అది స్థిరపడసాగింది.

రానురాను ఆమె ఇంటిముందు వచ్చి నిలబడే యువకుల సంఖ్య తగ్గింది.

చివరికి యువకులు రావటం ఆగిపోయింది.

అప్పుడు తాను వరించే యువకుడిని ఎంచుకుంది ఆమె.

అప్పుడు అందరూ అతడిని గమనించారు.

అతడు ఎన్నో రోజులుగా రోజూ ఆమె ఇంటిముందుకు వచ్చి నిలబడేవాడు.

కానీ ఎలాంటి విద్యను ప్రదర్శించలేదు.

వేరేవారు తమ విద్యనుప్రదర్శిస్తూంటే చూస్తూ నిలబడేవాడు. తాను ఎలాంటి విద్యను ప్రదర్శించేవాడు కాదు.

కానీ అందరికీ అతడు తెలుసు. ఆ ప్రాంతంలో అతడిని మించిన వేటగాడు మరొకడు లేడు.

ఆ తెగలవారు చలికాలంలో వేటకు వెళ్లేవారు. చలికాలం పూర్తయ్యే సరికి సంవత్సరానికి సరిపడ వేటను పట్టుకొచ్చేవారు. అందరికన్నా ఎక్కువ వేటను పట్టితెచ్చేది అతడే.

రోజూ వచ్చి నిలబడేవాడు. ఇతరులు ఆమె అంగీకారం పొందకుండా వెళ్లిపోతూంటే చూస్తూండేవాడు.

చివరికి యువకులు రావటం మానేసినా అతడు ఆమె ఇంటిముందు వచ్చి నిలబడటం మానలేదు.

ఆమె బయటకు వచ్చేది. ఎవరూ లేకపోవటం చూసి వెళ్లిపోయేది. వెళ్లిపోతూ అతనివైపు చూసేది.

అలా కొన్ని నెలలు గడిచాయి. చలికాలం దగ్గరపడుతోంది.

ఆమె ఎప్పటిలాగే ఇంటిబయటకు వచ్చింది.

అతడు బయట నిలబడి ఉన్నాడు.

వర్షం పడుతున్నా అతడు తప్పనిసరిగా వచ్చి తడుస్తూ నిలబడేవాడు.

ఆమె అతడివైపు చూసింది.

అతడు ఆమెవైపే చూస్తూ నిలబడ్డాడు.

లోపలకు వెళ్లబోయిన ఆమె అతడిని చూసి ఆగింది.

'నీ నైపుణ్యాన్ని ప్రదర్శించటం కోసం కాకపోతే ఎందుకని రోజూ వచ్చి నిలబడతావు?' ప్రశ్నించింది.

అతడు ఆమెని చూస్తూ నిలబడ్డాడు. మాట్లాడలేదు.

కాస్సేపు చూసి ఆమె అంది.

'నువ్వు నీ నైపుణ్యాన్ని ప్రదర్శించకపోతే నిన్ను నేను ఎలా ఎన్నుకునేది? నీకోసమని నేను అందరినీ కాదంటూ వచ్చాను. నువ్వు అడుగు ముందుకు వెయ్యకపోతే ఎలా?'

అతడు కదిలాడు. ఆమె దగ్గరకు వచ్చి నిలబడ్డాడు.

'అందరూ తమతమ రంగాలలో ప్రావీణ్యాన్ని ప్రదర్శించారు. నేను నీమీద నా ప్రేమను ప్రదర్శిస్తూ నిలబడ్డాను. నేను ఏదైనా ప్రదర్శిస్తే, నువ్వు కాదంటే, మళ్లీ ఈవైపుకు వచ్చే వీలుండదు'.

అందుకే నిన్ను చూస్తూ నిలబడ్డాను. నిన్ను చూస్తూ ఎంతకాలమైనా నిలబడగలను. అదే నేను ప్రదర్శించే ప్రావీణ్యం. అదే నా ప్రత్యేకత' అన్నాడు.

ఆమె అతడివైపు ప్రేమ నిండిన కళ్లతో చూసింది.

'నీ ప్రత్యేకత గుర్తించాను. అందుకే అందరూ తమ నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్న సమయంలో నేను వాళ్లని కాదు నిన్ను చూస్తూ నిలుచున్నాను' అంది.

'మరి నన్ను వివాహం చేసుకుంటావా?' అడిగాడతడు.

ఆమె తల ఊపింది.

'నేను వేటకు వెళ్లివచ్చేంతవరకూ నాకోసం ఎదురుచూస్తావా?'

'నువ్వు వచ్చేంతవరకూ నీకోసం ఎదురుచూస్తూనే ఉంటాను ప్రాణంపోయే వరకూ'

ఈవార్త క్షణాలలో ఊరంతా పాకిపోయింది.

అందరూ అతడిని అభినందించారు.

సంబరాలు జరుపుకున్నారు.

వేటకు వెళ్లే రోజు దగ్గరకు వచ్చింది.

తెల్లవారితే వేటకు వెళ్లాల్సి ఉండగా ఆరోజు సాయంత్రం అతడు ఆమెని కలిశాడు.

'ఈరోజు రాత్రి నదిలో పడవ ప్రయాణం చేద్దామా?'

ఆమె అంగీకారం తెలిపింది.

ఆ రాత్రి వెన్నెలలో నదిలో పడవ ప్రయాణం చేశారు వారిద్దరూ.

ఆ రోజు ఆ నదీ ప్రవాహం వెన్నెల ప్రవాహంగా మారింది.

'ఎంత అందంగా ఉందీ నది!' అన్నాడతడు.

ఈ నదిని చూసినప్పుడల్లా ఇకపై నువ్వే గుర్తుకు వస్తావు' అందామె.

'ఈ కొండలు వెన్నెలలో ఎలా మెరుస్తున్నాయో చూడు. నీ వదనం పైని వెన్నెల వాటిపై ప్రతిఫలించటం వల్ల వాటికీ ఆనందం అనుకుంటాను' అన్నాడతడు.

'ఈ అందమైన కొండలు మనసులో మెదిలినప్పుడల్లా నువ్వే గుర్తుకువస్తావు' అందామె.

'ఈ చెట్లు, ఆకులు, చెట్ల ఆకులపై చిందులాడే వెన్నెల నీ అందాన్ని చూసి ఆనందిస్తున్నట్టు ఉన్నాయి'

'ఈ చెట్లు, ఆకులు, చెట్ల ఆకులపై వెన్నెల గుర్తుకు వచ్చినప్పుడల్లా నువ్వే గుర్తుకు వస్తావు' అందామె.

'మంచు కురిసి, గడ్డకట్టి, కరిగే ఎండలు వచ్చేసరికి నేను వస్తాను. అప్పుడు మనమిద్దరం కలసి మళ్లీ ఇలాగే పడవలో విహరిస్తాం' అన్నాడతడు.

'ఈ నది, మంచు, ఎండ, వెన్నెల ఎప్పుడు చూసినా నువ్వే గుర్తుకు వస్తావు' అందామె.

*************

మరుసటి రోజు వేటకు ఆ ప్రాంతంలోని మగవారంతా వెళ్లిపోయారు.

ఆడవాళ్లు మాత్రం మిగిలిపోయారు. మగవాళ్లు తెచ్చే వేటను సంవత్సరకాలం భద్రపరచేందుకు అవసరమైన పనులు ఆరంభించారు.

కానీ ఎప్పటిలా చురుకుగా అన్ని పనులలో పాల్గొనలేకపోతోంది 'నీలిపుష్పం'.

ఉండి ఉండి మనిషి ఎక్కడున్నా ఆమె మనసు ఎక్కడికో వెళ్లిపోతోంది.

వృక్షాలను, ఆకులను చూసిన ఆమె చూస్తూ నిలబడిపోతోంది.

దూరంగా కొండలను చూసి వాటివైపే చూస్తూండిపోతోంది.

ఆమెను చూసి జాలిపడేవారు జాలిపడుతున్నారు. నవ్వుకునేవారు నవ్వుకుంటున్నారు.

ఆమెతో స్పందిస్తున్నట్టు ఆ సంవత్సరం మంచు అధికంగా కురుస్తోంది. అతడిని గుర్తుకుతెచ్చేవేవీ ఆమెకు కనబడకూడదన్నట్టు అన్నిటినీ మంచుతో కప్పేస్తోంది ప్రకృతి.

ఇంతలో ఒరోజు తెల్లవారే కోలాహలం మొదలయింది.

మగవారంతా వేటకు వెళ్లారని తెలిసిన శత్రుతెగవారు దాడికి వచ్చారు.

ఊరిని తగులబెట్టారు. వృద్ధులను ఆ మంటల్లోకి విసిరేశారు. ఆడవాళ్లందరినీ వెంటబెట్టుకునిపోయారు. వారిలో 'నీలిపుష్పం' కూడా ఉంది.

*************

'ఏమిటీ సంబరాలు చేసుకోకుండా నా దగ్గరకు వచ్చారు?' శత్రుతెగనుంచి ఆడవారిని పట్టుకొచ్చిన తరువాత కూడా తన దగ్గరకు వచ్చిన వాళ్ల మీద చిరాకుతో అడిగాడు తెగదొర.

'అందరినీ పంచుకున్నాం. కానీ ఈ అమ్మాయి విషయంలోనే ఏకాభిప్రాయం కుదరటంలేదు. అమ్మాయి అందరికీ కావాలి'.

'అమ్మాయినే ఎవరో ఒకరిని ఎంచుకోమను'

'అమ్మాయి ఎవరినీ కన్నెత్తిచూడటం లేదు. ఆమె అతడికి అంకితమట. చస్తాను కానీ మరొకరివైపు చూడనంటోంది'.

విచిత్రంగా నవ్వాడు దొర. 'ఎవరు గెలుచుకుంటే ఆడది వారిది. స్వంత ఇష్టాయిష్టాలతో సంబంధంలేదు'.

'ఆమెని సజీవ దహనం చేస్తామంటే అందుకు సిద్ధమౌతోంది తప్ప ఎవరినీ స్వీకరించేందుకు సిద్ధపడటంలేదు'.

'ఎవరా సుందరి?' అంటూ బయటకు వచ్చాడు దొర.

బయట కాళ్లుచేతులు సంకెళ్లలో ఉండగా నేలపై పడి ఉన్న ఆమెను చూశాడు.

మట్టిలోపడ్డ పారిజాత పుష్పలా ఉందామె.

ఆమెను చూడగానే అతడి హృదయం చిత్రంగా స్పందించింది.

ఆమె అంటే అభిమానం కలిగింది. గౌరవం కలిగింది. ఆమెను ఇతరులులా వస్తువులా భావించటం నేరం అనిపించింది.

ఆమె సౌందర్యం కాదు, ఆమె వ్యక్తిత్వం అతడిని ఆకర్షించింది.

ఎన్నిరకాలుగా భయపెట్టినా, ఎంతగా ఒత్తిడి చేసినా తన పట్టు వీడని ఆత్మ విశ్వాసం, ఆత్మగౌరవాలు, ఆమె అందంకన్నా సుందరమైనవని అతడికి అర్థమయింది.

'ఈమెను వదిలేయండి. ఇష్టం వచ్చినట్టు ఉండనీయండి. ఆమె ఎప్పుడు ఎవరిని ఇష్టపడితే వారితో ఉండనీయండి. అప్పటివరకూ ఆమె ఇష్టం'

ఆజ్ఞలు జారీచేసి వెనుతిరిగి చూడకుండా తన గుడారంలోకి వెళ్లిపోయాడు దొర.

వెనక్కు తిరిగి ఆమె వైపు చూస్తే తనను స్వీకరించమని ఆమెను బతిమిలాడతానేమోనన్న భయం అతడికి ఉంది.

*************

సంవత్సరానికి

సరిపడ వేటను మోసుకుని ఆనందంగా తమ ప్రాంతంలో అడుగు పెట్టిన అతడికి విధ్వంస దృశ్యం కనిపించింది.

జరిగింది అర్థమయింది. అతడి కళ్లు క్రోధంతో ఎరుపెక్కాయి. తన వెంట ఉన్నవారి వైపు తిరిగాడు.

'ఇంతకాలం ఆహారంకోసం వేటాడేము. ఇప్పుడు మనవారికోసం శత్రువులని వేటాడుదాం.' అన్నాడు ఆయుధాన్ని పైకెత్తి.

*************

అందరూ శత్రువుల స్థావరానికి చేరుకున్నారు రహస్యంగా. రాత్రంతా ఆగి, తెల్లవారుజామున అందరూ గాఢనిద్రలో ఉన్నప్పుడు విరుచుకుపడ్డారు. అందిన వారిని అందినట్టే ఊచకోత కోశారు.

తమవారిని కాపాడుకున్నారు. మిగతా వారినీ హింసించి బందీలుగా తీసుకువెళ్లాలనుకుంటుంటే నీలిపుష్పం అడ్డుపడింది.

'వీరు నన్ను మర్యాదగా, గౌరవంగా చూశారు. లేకపోతే నేను మీకు ప్రాణాలతో దొరికేదాన్ని కాదు. వాళ్లని హింసించకండి. వదిలేయండి' అంది.

ఆమె మాటను మన్నించి వాళ్లని వదలి అందరూ తమ ప్రాంతానికి ప్రయాణమయ్యారు.

*************

ఆ తరువాత ప్రతి సాయంత్రం, రాత్రి అతడు, ఆమె నదిలో పడవ షికారు చేస్తూండేవారు.

పాటలు పాడేవారు.

ఇప్పటికీ 'ఎస్సామక్వోజి' నది ప్రవాహం వారి పాటలతో ప్రతిధ్వనిస్తూంటుందని ఆ తెగవారు నమ్ముతారు. వారు సంపూర్ణంగా రూపాంతరం చెందిన అమెరికన్లుగా మారినప్పటికీ 'నీలిపుష్పం' గాథను వారు స్మరిస్తూంటారు. 'ప్రేమిస్తే అలా ప్రేమించాలి' అనుకుంటారు.

## చుక్కలు కలుపుతారా



## తేడాలు గుర్తిస్తారా





# అమ్మ మాట




దండకారణ్యంలో ఓ చిరుత పులి, తన ఇద్దరు పిల్లలతో నివసించేది. ఒకరోజు తల్లిపులి తన పిల్లలకు చెట్లు ఎక్కడం నేర్పించసాగింది. ఒక పులిపిల్ల చెట్టుమొదలు భాగాన్ని కొంత వరకు ఎక్కి కిందపడి, దెబ్బలు తగలటంతో 'అమ్మా' అంటూ బాధగా అరిచింది. రెండో పిల్ల 'అమ్మా! అన్నయ్య చెట్టెక్కి కింద పడ్డాడు. నేనసలు చెట్టే ఎక్కను' అంటూ అమ్మ ఒడిలో దాక్కుంది.

తల్లిపులి ఇద్దర్నీ చేరదీసి అక్కడే చెట్టుమీదకు ఎక్కుతున్న సాలె పురుగును చూపిస్తూ 'అది చెట్టు ఎక్కడానికి చేసే ప్రయత్నం చూడండి. ఎన్నిసార్లు పడుతున్నా పట్టువీడకుండా మళ్లీ ఎక్కుతోంది. చూడండి..చివరకు చెట్టుకొమ్మను చేరి విజయాన్ని సాధించింది. అలాగే ఆ చీమల్ని చూడండి, బాల్యంనుండి క్రమశిక్షణతో కష్టపడి పనిచేస్తే ఎన్ని ఇబ్బందులెదురైనా ముందుకుపోగలమని నిరూపిస్తున్నాయి. వాటిని చూసి నేర్చుకోండి. అంతేకానీ మొదట్లోనే భయంతో రాదురాదు అని కూర్చుంటే ఎప్పటికీ ముందుకుపోలేం. అలాగే నీ చుట్టూ ఉన్న లోకం చూడాలి. వారు మంచివారా, చెడ్డవారా అని తెలుసుకోవాలి. మనుషుల్లోలాగే మనలోకూడా ఈర్ష్యాపరులు, దుర్మార్గులు ఉన్నారు. సింహాలు, పెద్దపులులు, ఎలుగుబంట్లేకాదు, మన జాతి వారిలో కూడా మనకు శత్రువులు ఉన్నారు. వారినుంచి మనకు మనంగా రక్షించుకోవాలి. అందుకోసం శారీరకబలంతోపాటు గుండె ధైర్యం కలిగి ఉండాలి. బాల్యంనుంచే చెట్లను, గుట్టలను ఎక్కడం నేర్చుకోవాలి. ఒక చెట్టుకొమ్మనుంచి మరో చెట్టుకొమ్మకు క్షణాల్లో దాటిపోవాలి. మన శత్రువు మనల్ని ఎదిరించినప్పుడు మన జాతి చిరుతలైనా మనకు సాయంగా నిలిచి ఉండవు. కుందేళ్లు శాకాహార జంతువులు. అవి మనకన్నా చిన్నవి కదాని వాటిని తక్కువ అంచనా వేయకూడదు. వాటి మేథాశక్తి అమోఘం. వాటితో సింహాలు, పెద్ద పులులు కూడా పరుగుపెట్టడానికి పనికిరావు. వాటిని మనం వేటాడటానికి ప్రయత్నిస్తే పరుగులు తీసి సింహాలు, పెద్ద పులులు ఉన్న చోటుకు మనల్ని తీసుకుపోయి వాటికి ఆహారంగా మనల్ని బలి చేస్తాయి' అంటూ తల్లి ఇంకా ఏదో చెప్పబోతుంటే మధ్యలో చిన్న పులి పిల్ల 'అమ్మా! నీక్కూడా కుందేళ్ల దగ్గర భయమేనా?' అడిందీ.

ఏంచెప్పాలో తెలియక పెద్ద చిరుత ఒక్క క్షణం మౌనం వహించి, తర్వాత 'నాక్కూడానమ్మా! ఇక ఆహార సంపాదనకెళ్లినప్పుడు మన కంటే పెద్ద జంతువులపై దాడిచేయకూడదు. వాటితో పోరాటానికి మన శక్తి చాలదు. అలానే పెద్ద వాటితో స్నేహంచేసి వేటకు వెళ్ల కూడదు. ఆరోజు ఆహారం లభించకపోతే మనల్నే నిర్దాక్షిణ్యంగా చంపేసి తినేస్తాయి. అందుకే జాగ్రత్త అవసరం. జీవితంలో అన్ని విద్యలూ నేర్చుకోవాలి. అందరి దగ్గర స్నేహపూర్వకంగా మెలగాలి. ఆనాడే మన జీవితంలో అన్ని విధాల విజయాన్ని సాధించగలం. మీరు కూడా ఇప్పట్నుంచే కష్టపడాలి' హితోపదేశం చేసింది.

'అమ్మా! నువ్వుచెప్పినట్టే చేస్తాం' అని తల్లిని ముద్దుపెట్టుకున్నాయి. తల్లి చిరుత, పిల్లలను చేరదీసి నాలుకతో గోముగా ఒళ్లంతానాకింది. దాంతో రెండుపిల్లలు ఆనందంతో అమ్మ తోకను సరదాగా లాగుతూ అమ్మ వడిలో చేరుకున్నాయి.

–శివ్వాం ప్రభాకరం, బొబ్బిలి.







వార్త ఆదివారం

# జ్ఞానోదయం

## బాల గీతం

చింటు బంటులనెడి రెండు
చిన్న ఎలుగుబంటులుండె
చీటీమాటికెపుడు రెండు
కీచులాడుకుంటు నుండె

కలహమెంచబోకు మనుచు
కలిసి మెలిసి యుండమనుచు
పెద్దలంత జెప్పి చూసె
బుద్ధి మార్చుకొనకపోయె

ఇలా ఉండ నొక్కనాడు
ఈలలేసుకుంటు చింటు
నదివంతెన నెక్కి తాను
నడుచుకుంటు బోవుచుండె

కొంతదూరమెళ్లగానె
కొంటె బంటు ఎదురువచ్చె
తప్పుకోర పక్కకంటు
తగవు బెట్టుకొనియె బంటు

నేను ముందు వచ్చెనంటు
తప్పుకోరయంటు చింటు
తీవ్రముగను వాదులాడె
తిట్టుకుంటు కొట్టుకొనియె

వాదులాట పెరిగిపోయె
వంతెనపుడు విరిగిపోయె
చింటు బంటు నదిన పడియె
ఈత రాక ఏడ్చుకొనియె

దారిపోవు వాడు యొకడు
దరికి జేర్చె వాటినపుడు
తప్పు తెలిసె వాటికపుడు
తగవులాడలేదు యెపుడు!

–మద్దిరాల శ్రీనివాసులు
త్రిపురాంతకం.

**తేడాలు గుర్తిస్తారా జవాబు**

1. సూర్యుడిబొమ్మలో తేడా.
2. పైపునుండి వచ్చిన నీటిచుక్కల్లో తేడా.
3. మొక్కకు ఒకటే ఆకు.
4. సంగీతం గుర్తు ఒకటి తక్కువ.
5. పిల్లవాడి వెనుక మబ్బులాంటి డిజైన్‌లో తేడా.
6. చేతి వేలిలో తేడా.

## హలో ఫ్రెండ్...



చిన్నారుల ప్రశ్నలకు

వార్త సిఎండి, మేనేజింగ్ ఎడిటర్

**గిరీష్ అంకుల్ సమాధానాలు**

**డి.నగేష్‌కుమార్, నిజామాబాద్.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఎనిమిదో తరగతి చదువుతున్నాను. వ్యవసాయంలో రసాయన ఎరువుల వాడకంకన్నా సేంద్రియ ఎరువుల (బయో మెన్యూర్) వాడకం మంచిదని విన్నాను. అయితే సేంద్రియ ఎరువుల వల్ల కలిగే లాభాలేమిటి? దయచేసి దాని గురించి వివరించండి.**

**జవాబు:** నగేష్ కుమార్! సేంద్రియ ఎరువులలో మొక్కలకు కావలసిన సూక్ష్మ పోషక విలువలు, స్థూల పోషక విలువలు ఉంటాయి. వీటిలోని నైట్రోజన్, ఫాస్పరస్, పొటాషియంలతో పాటు సూక్ష్మ పోషకాలైన మాంగనీస్, జింక్, కాపర్, ఇనుము ధాతువులు కలిసి నేలను సారవంతంచేస్తాయి. సేంద్రియ ఎరువులు నేలలో మైక్రోబ్‌లను ఉత్తేజపరిచి విస్తృతంగా వృద్ధిచేస్తాయి. ఈ మైక్రోబ్స్ వృక్ష, జంతు సంబంధ వ్యర్థ పదార్థాలను జీవవియోగం చెందిస్తాయి. నైట్రోజన్‌ను స్థిరీకరిస్తాయి. అలాగే ఫాస్ఫేట్‌లను కరగని లవణాలను కరిగించి మొక్కలకు ఫాస్ఫేట్ పోషకవిలువల నందిస్తాయి. ఇవి నేలను మృదువుగా ఉంచుతాయి. నేలలు తేమను నిలుపుకో గలుగుతాయి. ఎక్కువనీరు ఉన్నప్పుడు నీటిని పీల్చుకొని, నీరు నిలువ కూడా చేస్తాయి. అంతేగాకుండా నేల, కోతకు గురికాకుండా సహకరిస్తాయి. ఇవి నేలలో చల్లిన విత్తనాలు మొలకెత్తడానికి తోడ్పడతాయి. నేలలో మైక్రోబ్‌లను వృద్ధిచేసి హ్యూమస్ జీవపదార్థాన్ని విస్తృతపరుస్తాయి. వీటివాడకం వలన మొక్కలకు చీడపురుగుల వ్యాధులను తట్టుకునే శక్తి పెరుగుతుంది.

**కె.రాధిక, తిరుపతి.**

**ప్రశ్న: గిరీష్ సంఘీ అంకుల్ గారికి నమస్తే. నేను ఏడో తరగతి చదువుతున్నాను.ప్రపంచంలో అన్నిటికన్నా పెద్ద జంతువు ఏది? అది తీసుకునే ఆహారం ఏమిటి? దయచేసి వివరించండి.**

**జవాబు:** రాధికా! ప్రపంచంలో పెద్ద జంతువు నీలి తిమింగలం. ఇది 108 అడుగుల పొడవు ఉంటుంది. దీని బరువు 80 టన్నులు. అయితే వీటికి నోట్లో పళ్ల మాత్రం ఉండవు. అందుకే దేనినీ కొరికి తినడం దీనికి చేతకాదు. అందువల్ల ఇవి చిన్నిచిన్ని పురుగులను, రొయ్యలనూ తిని బతుకుతాయి. మరి నోటిలో పళ్లులేనప్పుడు పురుగులనెలా పట్టుకుంటాయననే సందేహం రావచ్చు. అందుకు వీటికి దువ్వెనకు ఉండే పళ్లవంటి చిల్లులు గల ఓ ప్రత్యేకరకం ఎముక పై దవడలో ఉంటుంది. ఈ దవడనే బలీన్ అంటారు. నీలి తిమింగలం నోరు తెరుచుకుని ఈదుతూ, నోటినిండా ఈ జీవులు చేరగానే పై దవడను తెలివిగా మూసేస్తుంది. బలీన్ చిల్లులోంచి నీళ్లు బయటికిపోయి, పురుగులు నోట్లో మిగిలిపోతాయి. అంతే. హాయిగా వాటిని తినేస్తుంది.



# 'అమ్మ'కు అసలైన నిర్వచనం ఆమె!

**కన్నబిడ్డను కోల్పోయిన ఓ తల్లి ఆ దుఃఖంతోనే కుంగిపోలేదు. తన మాతృ ప్రేమను పంచటానికి కన్న బిడ్డలే కావాలనుకోకుండా మనసును మరింత విశాలపరచుకుని అనాథ బిడ్డలకు అమ్మ అయింది. ఆ అమ్మ పేరు డా.సరోజిని. ఆమె 30 ఏళ్ల కిందట తన కుమార్తెను కోల్పోయింది. ఇప్పుడు ఆమె 800మంది అనాథ పిల్లలకు ప్రేమామృతాన్ని పంచుతోన్న అమ్మ.**



లక్నోలో డా.సరోజిని ఒక హోమ్ ప్రారంభించింది. ఆ హోమ్ బయట ఓ ఉయ్యాల..దారిన వెళ్లేవారు వింతగా చూడవచ్చుకానీ అది ఆత్మీయానురాగాలు, మాతృప్రేమల నిలయమని తెలిపే చిహ్నంగా ఏర్పాటైంది. 30 ఏళ్లుగా ఆ ఉయ్యాలలో ఎందరో అజ్ఞాత తల్లులు ఆడశిశువుల్ని వదిలి వెళ్లారు. వారికి డా.సరోజిని అమ్మ అయింది. ఆ హోమ్ పేరు మనీష మందిర్. ఇప్పుడు ఆమె వయసు 80 సంవత్సరాలు.

ఆమె నేపథ్యంలోకి తొంగిచూస్తే.. జోధ్‌పూర్‌లో పుట్టిపెరిగిన సరోజిని హిందీ లిటరేచర్‌లో పిహెచ్‌డి చేసింది. ఆమె రచయిత్రికూడా. ఎన్నో కథలు, కవితా సంపుటులు, నవలలను రాసింది. 'బాత్ స్వయం బోలేగీ' పేరిట జీవితచరిత్ర కూడా రచించింది. తన రచనా వ్యాసంగంతో పాటు ఆమె తన భర్త, వృద్ధులైన అత్తమామలు, ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె ..ఇంతమంది ఆలనాపాలనా చక్కగా నిర్వర్తించేది. 1978లో అంటే ముప్ఫయ్ సంవత్సరాల కిందట సరోజిని కుమార్తె ఎనిమిదేళ్ల మనీష ఒక రోడ్డు ప్రమాదంలో కన్ను మూసింది. అదీ ఆమె ద్విచక్రవాహనం నడుపుతుండగా జరిగిన దుర్ఘటన కావటం. తన బిడ్డే ఎందుకు మరణించాలి? అన్న ప్రశ్న ఆమెను వేధించేది. చివరకు ఆమెలోని విజ్ఞత బదులిచ్చింది. తను ఒక్క బిడ్డ కోసం దుఃఖిస్తోంది, కానీ తన చుట్టూ ఎందరో మనీషలు, ఇల్లనేది లేక, ప్రేమకు నోచుకోక, అమ్మ ప్రేమకోసం అలమటిస్తున్నారు. వారిని తాను ఆదరించి, ఆశ్రయం ఇవ్వగలిగితే.. ఆ ఆలోచన కార్యరూపం దాల్చటానికి చాలా కాలమే పట్టింది. సరోజిని పెద్దకుమారుడు ఇంజనీర్ అయిన సందర్భంలో తన ఆలోచనను వెల్లడించింది..అనాథ బాలలకోసం ఓ హోమ్ ఏర్పాటు చేయాలనుందని వివరించింది. ఆమె భర్త విపి అగర్వాల్ కూడా ఆమె ఆశయంలో పాలుపంచుకున్నాడు. ఆ పిల్లలకు 'పాపా' అయ్యాడు.

1985లో మనీషా మందిర్ నెలకొల్పారు. తమ ఇంట్లోనే ఓ మూడు గదులను హోమ్‌కోసం కేటాయించారు. తన పుస్తకాలపై రాయల్టీగా వచ్చిన డబ్బు నంతటినీ హోమ్ నిర్వహణకోసం ఖర్చు చేశారు. తొలిగా ఆమె దత్తత తీసుకున్న పాప చెవిటిది, మూగది. ఆ పాప తల్లి



డైవోర్స్..పాపకు జన్మనిస్తూనే కన్ను మూసింది. ఆ పాపకు శివి అని పేరుపెట్టింది. ఆ తర్వాత ప్రమాదంలో తమ తల్లిని కోల్పోయిన మరో ఇద్దరు పాపలు మనీష మందిర్‌లో చేరారు. ఆ తర్వాత మిగిలిన అమ్మాయిలు అక్కర్లేని పిల్లలుగా వీధుల్లో విడిచిపెట్టబడినవారు. డా.సరోజిని వారిని తానే స్వయంగా తీసుకొచ్చి హోమ్‌లో వారికి ఆశ్రయం కల్పించింది.

డా.సరోజిని హోమ్ బయట ఓ ఉయ్యాలను ఏర్పాటుచేసిందని పైన చెప్పుకున్నాం కదా. దానికి 'సంజీవన్ పాలన' అని పేరు పెట్టిందామె. అనేకానేకకారణాల వల్ల తమకు బిడ్డ వద్దనుకునేవారు వీధుల్లో వదిలే బదులు మనీషా మందిర్ గేటు వద్ద ఉన్న ఉయ్యాలలో విడిచివెళ్లటం పరిపాటి అయింది. అలాటివారిలో రెండురోజుల శిశువులు కూడా ఉన్నారు. అప్పుడు తనకు కలిగే భావాలను చెపుతూ సరోజిని ఇలా అంటారు..'తల్లి కావాలంటే బిడ్డకు జన్మ ఇవ్వటమొక్కటే మార్గంకాదు. ఆ అనాథ బాలల్ని చేతుల్లోకి తీసుకున్నప్పుడు పాప కావాలనుకున్న నా కోరిక తీరినట్లనిపించేది. మొదట్లో వారిని పెంచడంలో కొన్ని సమస్యలు ఎదురయ్యేవి. కానీ అలా అని అధైర్యపడలేదు. అదొక సవాలుగా తీసుకొని వారికి సమస్తం అందించాను. పాపలందరూ నన్ను 'అమ్మా..అమ్మా' అని పిలవటంతో నాకు అత్యంతానందం కలిగేది' అంటుంది.

కాలగమనంలో మనీషా మందిర్ కొన్నిసార్లు తన చిరునామాను మార్చుకుంది. ఇప్పుడు లక్నోలోని గోమతినగర్ ప్రాంతంలో ఓ మూడంతస్థుల భవనంలో నెలకొంది. అందులో మంచి లైబ్రరీ ఉంది. కంప్యూటర్ ల్యాబ్, క్రాఫ్ట్ వర్క్‌షాప్, రిక్రియేషన్ హాల్స్, ధర్మశాలలు, ఉయ్యాలలతో కూడిన తోటలు, బాస్కెట్ బాల్, బ్యాడ్మింటన్ కోర్టులు, టెలివిజన్ రూమ్ వంటి ఎన్నో సౌకర్యాలు పిల్లల మానసిక వికాసానికి, విజ్ఞానానికి తోడ్పడేవిగా ఉన్నాయి. పిల్లలు ఇక్కడ కుట్లు, అల్లికలు, ఇతర వృత్తి నైపుణ్యాలు కూడా నేర్చుకునే ఏర్పాట్లు ఉన్నాయి.

పిల్లలకు మంచి విద్యను కూడా ఆమె అందిస్తున్నారు. హోమ్‌కు అయ్యే ఖర్చు రానురాను పెరగటంతో అగర్వాల్ దంపతులు ఆ భవంతిపై ఓ పెద్ద హాల్ నిర్మించి దాన్ని ఫంక్షన్లకు లీజుకు ఇస్తున్నారు. విద్య ప్రాముఖ్యం తెలిసిన ఆమె పిల్లలను ప్రతిష్ఠాత్మక విద్యాలయాలలో చేర్పించింది. పిల్లల్లో చాలామంది తమ ప్రతిభాపాటవాలను నిరూపించుకొని, తమ అర్హతలకు తగ్గ ఉద్యోగాలను సైతం చేజిక్కించుకున్నారు. పిల్లల భవిష్యత్తుకు

తాము చేయగలిగిందంతా చేస్తున్నామని, అందుకు తన కుటుంబ సభ్యులందరూ ఎంతగానో సహకరిస్తున్నారని, వారి తోడ్పాటు లేకుంటే తాను ఇంత చేయగలిగే దాన్ని కాదంటారామె.

ఇక్కడ పెరిగే అనాథ బాలికలు 17-18 సంవత్సరాల వయసు వరకు ఉంటారు. ఆపైన ఉద్యోగం సంపాదించుకునే దిశలో ఉంటారు. ఇప్పటివరకు ఇక్కడ 800మందివరకు అనాథ బాలికలు పెరిగారు. వీరిలో చాలా మంది బ్యాంకు మేనేజర్లు, టీచర్లు, ప్రిన్సిపాల్స్‌గా స్థిరపడితే, మరి కొందరు మంచి వ్యక్తులను పెళ్లి చేసుకుని ఆరకంగా స్థిరపడ్డారు. చాలామంది బాలికలు చట్టబద్ధ దత్తత ద్వారా పునరావాసం పొందారు.

డా.సరోజిని 'మనీషా మందిర్' ద్వారా అందిస్తోన్న సేవలకు గుర్తింపుగా జాతీయ పురస్కారం లభించింది. ఇటీవల ఆమె బేటీ బచావో, బేటీ పఢావో అకాడెమీలను నెలకొల్పింది. బేటీ బచావో అకాడెమీ ద్వారా పేద బాలికలకు ఉన్నత విద్యకు 'మనీషా హయ్యర్ ఎడ్యుకేషన్ స్కాలర్‌షిప్' పేరిట ఆర్థికసహాయం అందిస్తున్నారు. నలుగురు సభ్యులతో కూడిన కమిటీ ప్రతిభా వంతులైన బాలికలను ఈ స్కాలర్‌షిప్‌కు



ఎంపిక చేస్తుంది. ఎంపికయిన బాలికలకు బ్యాచిలర్, మాస్టర్స్ డిగ్రీ పొందేవరకు అంటే మూడేళ్ల కాలం వరకు ఆర్థిక సహాయం అందిస్తారు. అయితే డా.సరోజిని వయో భారం కారణంగా ఇకపై పురిటికందుల్ని పెంచడం తనకు కష్టమేనని తెలిపారు. అయితే తాను ఎంతకాలం అనాథ బాలికలకు సహాయ పడగలిగితే అంతకాలం సహాయపడతానని అంటారామె.

'ప్రతి ఒక్క అనాథ బాలికలో నాకు నా బిడ్డ మనీషాయే కనిపిస్తుంది. బహుశా ఈ అనాథ బాలికల సేవ కోసమే దైవం నా బిడ్డను నానుండి తీసుకుపోయాడేమో. నాకు ఈ అవకాశం కల్పించి, సార్థకమైన రీతిలో నాబిడ్డ జ్ఞాపకాన్ని ప్రోది చేసుకునేలా చేసిన దైవానికి కృతజ్ఞతలు చెప్పుకుంటాను' అంటుందామె. అమ్మకు అసలైన అర్థాన్ని చెప్పిన డా. సరోజిని అందరికీ ఆదర్శనీయురాలు. 'ఆడపిల్లను ఆదరిద్దాం' అని నినదిస్తే సరిపోదు, డా.సరోజినిలా ఆచరణలో పెట్టినప్పుడే ఈదేశంలో ఆడపిల్ల ఉనికి బలంగా నిలబడగలిగేది. ■

---

లోకం పోకడ...

# నాలుకతో కంటి చికిత్స!

బోస్నియా గ్రామీణ ప్రాంతంలో హవా సెలెబిక్ అనే ఎనభై ఏళ్ల వృద్ధురాలు నాలుకతో కంటివైద్యం చేస్తుంది. ఎవరికైనా కంట్లో లోహపు ముక్కలు, బొగ్గునలుసులు, గాజు ముక్కలు లేదా ఇసుక రేణువులు పడితే, ఆమెను సంప్రదిస్తే వెంటనే ఆమె నాలుకతో వాటిని కంటినుంచి తొలగించి, వారికి బాధానివారణ కలిగి స్తోంది. స్థానికులు ఆమెను నానా హవా అని పిలుస్తారు. ప్రపంచంలో ఇలా నాలుకతో కంటివైద్యం చేసేది తాను ఒక్క దాన్నే అంటుందామె. ఈ చికిత్సను తాను హవా అనే ఆమె దగ్గర్నుంచి నేర్చుకున్నానని, కానీ దురదృష్టవశాత్తు తాను ఎవరికీ ఈ వైద్యం నేర్పలేకపోయాననీ, కారణం తన పిల్ల లెవరూ అందుకు ఇష్టపడలేదని అంటుందామె. వేర్వేరు దేశా లకు చెందిన దాదాపు 5,000మందికి తాను నాలుకతో కంటి వైద్యం చేశానంటోందామె. ఆధునిక వైద్యం ఏమాత్రం ఉపక రించని ఎంతోమంది ఉబ్బిన కంటితో తన వద్దకు వస్తుంటా రని, వారందరినీ ఆ బాధనుంచి రక్షిస్తున్నాననీ అంటుందామె. నాలుకతో చికిత్స చేసే ముందు తన నాలుకను ఆల్కహాల్‌తో శుభ్రపరచుకుంటానంటుంది. తాను చేసే ఈ సేవకు సాధారణంగా 10 యూరోలు తీసుకుంటానని, అయితే నిరుద్యోగులకు, పేదలకు ఉచితంగానే సేవలందిస్తానని అంటోంది నానాహవా.

---




* ఒక ముసలావిడ రైలు పట్టాల పక్కనే నడుచుకుంటూ వెళ్తుండగా..

టి.సి.: బామ్మగారూ! పెద్దవారు, నడవలేరు. రైలెక్కండి. నెక్స్ట్‌స్టాపేకదా, దిగిపోదురుగాని.

ముసలావిడ: వద్దునాయనా..నేనసలే అర్జంటు పనిమీద వెళ్తున్నాను.

* ఆఫీసర్ తన చెవిటి పి.ఎ.తో...

లెటర్ డిక్టేట్‌చేస్తూ చివర 'సెండ్ ఈ మెయిల్' అని చెప్పాడు.

చెవిటి పి.ఎ. 'సెండ్ ఫిమేల్' అని రాసుకున్నాడు.

* రెండు దెయ్యాలు సంభాషించు కుంటున్నాయి.

మొదటి దెయ్యం: ఏమిటోయ్! రోజూ ఎంతో సరదాగా ఉండేవాడివి. ఈరోజెందుకు డల్‌గా ఉన్నావు.

రెండో దెయ్యం: ఏంచెప్పమంటావ్. మా ఆవిడ చచ్చి ఈలోకానికి వచ్చేస్తోంది మరి..

భార్యాభర్తలు బజారులో వెళ్తుంటారు.

భార్య: ఏమండీ..ఏమండీ..మీరు రెండు బనీన్లు కొనుక్కోకూడదూ...

భర్త:ఎందుకే నామీద అంత ప్రేమ.

భార్య:ఏంలేదు..బ్రహ్మాండం బ్రదర్స్‌లో ఒక పట్టుచీర కొంటే రెండు బనీన్లు ఫ్రీ అని అదుగో ఎదురుగా ఆఫర్ రాసి ఉంది..




# లతా మాధవీయం

– ఇమంది రామారావు

**అది శోభనం గది.**

**సినిమాల్లో చూపిస్తున్నట్లు మొదటి రాత్రి అలంకరణలూ, ద్యూయెట్లూ అవ్వేవీ లేవుగాని డబుల్ బెడ్డూ, దాని ముందర టీపాయ్, తినడానికి స్వీట్లూ, యాపిల్సూ, ఫ్లాస్కునిండా ఫ్రిజ్‌లో కోక్ ఫుల్‌బాటిల్ వుంది. అన్నింటినీ మించి ప్రేమించి పెళ్లి చేసుకున్న లతకు మంచి మూడ్ వుంది.**

ఈ క్షణం కోసమే క్షణాలు లెక్కపెడుతూ ఎదురుచూస్తున్న మాధవ్‌కి మనసునిండా లతతో గడిపిన స్వీట్ నథింగ్స్ తరుముకొస్తున్నె. లత పక్కనే బెడ్డుమీద కూర్చున్నాడు. ఎన్నో మాట్లాడాలనుకున్నాడు, ఒక్క మాటా రావడం లేదు.

లత పరిస్థితీ అదే. నిశ్శబ్ద సంగీతం వినిపిస్తోంది.

"ఏవైనా హాపీగా కబుర్లు చెప్పు లతా!"

శోభనం గదిలో ఎన్నో అడగాలనుకొని రిహార్సల్స్ వేసుకున్న లత మౌనంగా వుండిపోయింది. ఆమెకు చిరుచెమట్లు పడుతున్నె. మరింత అందంగా కనిపించింది.

"లతా! నేను చాలా అదృష్టవంతుడ్ని!"

"వూఁ... నేను కూడా"

"ఎందుకని?"

"మీరే చెప్పండి"

"కోరుకున్న భార్య దొరకడం ఎంతదృష్టం.. మనం బతికున్నంత కాలం ఒకరికొకరం ప్రాణంగా వుందాం. నువ్వేం కోరుకుంటున్నావో చెప్పు!"

"ఈ ప్రేమ నేను కను మూసేటంతవరకూ శాశ్వతంగా వుండాలని!"

"అవ్వేం మాటలు? శరీరాలు వేరయినా మనం ఒకటే!" అంటూ దగ్గరికి జరిగి గట్టిగా కౌగలించుకున్నాడు.

లతకి ఏదో తియ్యని బాధ.

"అబ్బబ్బ... వదలండీ!"

"వదలను... జీవితాంతం వదలను!"

"ఏవిటీ అల్లరి?"

"అల్లరి లేకపోతే మజా ఏం వుందోయ్! మనం ఈ రాత్రి గడిపిన మధుర జ్ఞాప కాల్ని జీవితమంతా పదిలపరుచుకోవాలి" లతని మాధవ్ అల్లుకుపోయాడు.

లత సిగ్గులమొగ్గయ్యింది. సన్నగా నవ్వింది. సడన్‌గా కరెంటు పోయింది.

"ఇదేమిటీ? సందట్లో సడేమియాలా ఇపుడు కరంటు పోవడమేంటి?"

"నేనే ఆఫ్ చేశాను" అంది మాధవ్‌చెవిలో.

"అమ్మ దొంగా! నువ్వు చాలా అడ్వాన్సుగా వున్నావూ!" ఆమె గుండె గుసగుసలు వినసాగాడు. బెడ్ లైట్ వెలుతురులో వినూత్నంగా మెరిసిపడుతోంది లత. ఆ రాత్రి లతామాధవ్‌లు తమ జీవితంలో కన్న కలలన్నీ కరిగించుకున్నారు.

* * *

"లతా!" రాగం తీస్తూ పిలిచాడు మాధవ్.



"ఓయ్...! వంటింట్లోంచి పలికింది లత.

"నేనాఫీసుకెళ్తున్నానూ!"

"ఇదిగో వస్తున్నానూ... ఇదిగో టిఫిను... ఇది మీ సెల్‌ఫోన్, ఫుల్ చార్జింగ్‌లో వుంది. ఇవి మీ స్కూటర్ తాళాలు. ఇంకేం కావాలి?" ఆలోచనలో పడింది లత.

"అసలైంది మరిచిపోయావు"

"ఏవిటబ్బా? ఆఁ.. అసలైంది? ఏదో గుర్తుకి తెచ్చుకోబోతుండగా లతని లాక్కొని చటుక్కున ముద్దు పెట్టుకున్నాడు.

లత కొన్ని క్షణాలు అతడ్ని అల్లుకుపోయింది.

"లతా! ఒక పని చేస్తే ఎలా వుంటుంది?"

"ఏవిటబ్బా ఆ ఒక పని?"

"ఆఫీసుకి లీవ్ పెట్టి పగలూ... రాత్రీ ఎంజాయ్ చేస్తే."

"పరమ ఛండాలంగా వుంటుంది. టైమవుతోంది పదండి!" స్కూలు పిల్లాడ్ని బడికి పంపించినట్లు పంపించింది. తర్వాత జరిగింది గుర్తుకొచ్చి పడీపడీ నవ్వుకుంది.

* * *

మాధవ్–లతల మధ్య కాపురం మూడు వువ్వులూ, ఆరు కాయలుగా సాగిపోయింది.

పెళ్లయిన రెండేళ్లకి పండంటి బిడ్డ. ఈ బిడ్డని ప్రయోజకుడ్ని చేస్తే అంతే చాలనుకున్నారు. మాధవ్, లత ఒకే మాట, ఒకే బాట, ఒకే ప్రాణంగా కాపురం చక్కదిద్దుకుంటున్నారు.

మాధవ్‌కి మేనేజర్‌గా ప్రమోషనొచ్చింది. స్కూటరు స్థానంలో కారొచ్చింది. మేనేజరు స్థానంలో మాధవ్ కూర్చున్నాడు. స్టాఫ్ అందరూ అభినందనల వర్షం కురిపిస్తున్నా రు. ఇదో కొత్త అనుభవం. మాధవ్‌తో కలిసి పని చేసేందుకు స్పెషల్ ఆఫీసర్‌గా జోనల్ ఆఫీసు నుండి ప్రియ వచ్చి చేరింది. అల్ట్రామోడన్‌గా వుంది. మెరుపుతీగలా కదుల్తూ ఆఫీసు పనులు చక చకా చేసేస్తుంది. ఆఫీసులో స్టాఫ్ అందరూ తనతో ఏదో పని కల్పించుకొని మాట్లాడుతున్నారుగానీ ప్రియ మాత్రం గంభీరంగా వుంది.

ఆఫీసు పనిగంటలు ముగిశాయి. స్టాఫ్ ఎవరిమటుకు వారు మేనేజర్‌కో మాట చెప్పి వెళ్లిపోతున్నారు.

ప్రియ ఫైల్సుతో వచ్చింది. ఆ రోజు బిజినెస్ ట్రాన్జాక్షన్స్‌న్నీ అప్‌డేట్ చేసి అందించింది.

ఒక నెల రోజులపాటు డైలీ షెడ్యూలు ప్లాన్ చేసి ఇచ్చింది.

మాధవ్‌కి మతిపోయినంత పనయింది. అభినందించకుండా వుండలేకపోయాడు. పొగడ్తల వర్షం కురిపించాడు. ప్రియ అవేం పట్టించుకోలేదు.

"నేను వెళ్తున్నా సర్!" అంది.

"ఏం...! అర్జంటుగా వెళ్లాలా?"

"లేదు... కానీ వెళ్లాలి. కొత్తగా ట్రాన్స్‌ఫరయ్యాను కదా.. అన్నీ సర్దుకోవాలి!"

"స్టాఫ్ హెల్ప్ తీసుకోలేకపోయావా?"

"నో... థాంక్యూ సర్!"

"మీకు.... మీకు పెళ్లయిందా?"

"లేదు... ప్రియ పెదవులమీద సన్నటి నవ్వు తేలిపోయింది.

"బెస్టాఫ్ లక్" అంటూ షేక్‌హాండ్ తీసుకోవాలని చెయ్యి చాచాడు.

"థాంక్యూ!" షేక్‌హాండ్ తీసుకుంది.

మాధవ్ శరీరంలోకి ఏదో విద్యుత్ పాకుతున్నట్లనిపించింది.

"ఇదిగో... నా విజిటింగ్ కార్డు. ఇందులో నా ఫోన్ నెంబరుంది. మీకెపుడు ఫోన్ చెయ్యాలనిపిస్తే అప్పుడు చెయ్యండి. ఆఫీసుకి సంబంధించి" అంటూ వయ్యారంగా బైటికి నడిచింది.

మాధవ్ ఇంటికొచ్చి పిల్లాడితో కాస్సేపాడుకొని, ప్రియని గురించి లతతో తెల్లవారూ ఏకరువు పెట్టాడు. ప్రియ మంచితనం, సిన్సియారిటీ, అందం-ఆకర్షణ, ప్లానింగ్... చెప్పిందే చెబుతూ ఏదో తెలియని తన్మయత్వంలో మునిగిపోయాడు.

"మునిగింది చాలు! ఇక నిద్రపోండి" సన్నగా మందలించింది. ఇలా నెల రోజులు గడిచాయి. మాధవ్‌లో మార్పు కొట్టేచ్చేలా కనిపిస్తోంది.

మాధవ్ ఇంటికొచ్చి పిల్లాడితో కాస్సేపాడుకొని, ప్రియని గురించి లతతో తెల్లవారూ ఏకరువు పెట్టాడు. ప్రియ మంచితనం, సిన్సియారిటీ, అందం-ఆకర్షణ, ప్లానింగ్... చెప్పిందే చెబుతూ ఏదో తెలియని తన్మయత్వంలో మునిగిపోయాడు.

"మునిగింది చాలు! ఇక నిద్రపోండి" సన్నగా మందలించింది. ఇలా నెల రోజులు గడిచాయి. మాధవ్‌లో మార్పు కొట్టేచ్చేలా కనిపిస్తోంది...

లత నాలుగైదుసార్లు సున్నితంగా మందలించింది.

మాధవ్ పెడచెవిని పెట్టాడు.

ఆరోజు ఆఫీసుకి బయలుదేరేముందు-

"బాబుకి టెర్మ్ ఫీజు కట్టాలి!"

"కట్టేసెయ్!"

"మీకు మేనేజర్‌గా ప్రమోషనొచ్చింతరవాత జీతం ఎన్నిసార్లు ఇచ్చారు?" సూటిగా మాధవ్ కళ్లల్లోకి చూస్తూ అడిగింది.

"గుర్తు లేదు!" బైటికి నడిచాడు.

వరండాలో అడ్డం పడింది.

"ఇంట్లో సరకులైపోయాయ్!"

"తెచ్చేసెయ్!"

"అయిదు వేలు కనీసం అవసరం!"

"ఏదో ఒకటి చెయ్"

"ఏదో ఒకటి అంటే నగలు తాకట్టు పెట్టమనా?"

"అది నీ ఇష్టం!"

"నా హెల్త్ డిస్టర్బ్ చేస్తోంది. డాక్టరు దగ్గరికెపుడెల్దాం?"

"నాకు తీరిక లేదు!" ఇక లత ప్రశ్నలకోసం ఎదురుచూడకుండా కారు స్టార్ట్ చేశాడు.

మాధవ్ ప్రవర్తనలో మార్పు కనిపించింది.

లత కోరికమీద లత తల్లి వచ్చింది. అల్లుడి ప్రవర్తనని అర్థం చేసుకుంది. నలుగురు పెద్ద మనుషుల్ని పిలిచి ఆ నలుగురిలో మాధవ్‌ని కడిగేద్దామనుకుంది. లత అందుకు ఒప్పుకోలేదు. ఆయన మారతాడన్న నమ్మకం వ్యక్తం చేసింది.

"ఏవిటమ్మా నీ నమ్మకం?"

"నేను కొనుక్కున్న స్కేలు వంకరగా వుందంటే అది నా గుడ్డితనం. దానికి నేనే బాధ్యురాల్ని. నన్నిలా వదిలెయ్!" అంది.

మాధవ్ ఆఫీసుకి వెళ్లడానికి సిద్ధమయ్యాడు. అత్తయ్య కల్పించుకొని మాట్లాడుతూ "బాబూ! ఈ రోజు తిరిగివెళ్లిపోతున్నాను"

"మంచిది...!"

"లతని నాతో నాలుగు రోజులు తీసికెళ్తాను!"

"చాలా మంచిది"

"మరి బాబుకి స్కూలు?"

"నేను ఫోన్ చేసి స్కూల్లో చెప్తాలే!"

"మీరెప్పుడొచ్చి తీసుకెళ్తారు?"

"నాక్కుదరదు. మీరే పంపించండి. వచ్చిన రోజు ఫోన్ చేస్తే డ్రైవర్ని పంపిస్తాను. మరో ప్రశ్న అడిగే అవకాశం ఇవ్వకుండా బైటికి నడిచి కారు స్టార్ట్ చేశాడు.

* * *

మాధవ్ ఆఫీసులో అడుగు పెట్టగానే ఫ్లవర్ బొకేలూ, అవార్డులూ రివార్డులతో స్వాగతం పలికారు, హెడ్డాఫీసు సిబ్బంది. ఆఫీసు స్టాఫ్ కూడా వారితో పోటీగా పొగడుతూ అభినందల వర్షంలో ముంచెత్తారు.

"మిస్టర్ మాధవ్! ఒకే ఒక్క నెలలో పాతిక కోట్లు డిపాజిట్లు సేకరించి రికార్డ్ క్రియేట్ చేశారు. మీలా అన్ని బ్రాంచీలు పని చేస్తే మన బ్యాంకుకి ఇంకా మంచి పేరొస్తుంది. వన్స్ ఎగైన్ హార్టీ కంగ్రాట్యులేషన్స్ టు యూ అండ్ యువర్ స్టాఫ్!" అంటూ అభినందించారు. ఆ రోజు ఆఫీసులో పండగ చేసుకున్నారు.

ఆ సాయంత్రం ఆఫీసులో మాధవ్, ప్రియ ఇద్దరే వున్నారు.

"ప్రియా! నిన్నెలా అభినందించాలో మాటలు రావడం లేదు. ఈ విజయం నీదే!"

"థాంక్యూ!" అప్రయత్నంగా చేతులు కలిపి అలా వుండిపోయారు. అతడి నరాలు జివ్వుమన్నై. మనసు స్వాధీనం తప్పుతోంది.

"ఇది ఆఫీసు... వదలండి. నేను వెళ్లాలి. ఇంట్లో చెయ్యలేదు... వంట చేసుకోవాలి!"

"ఈరోజు నో వంట. నేను పార్టీ ఇస్తున్నాను! ఎగ్జయిటింగా అన్నాడు.

"బైటికైతే రాను!"

"బైటికెందుకూ.. బ్రహ్మాండగా మీ ఇల్లుందిగా!"

"ఆఁ...!" అంటూ కిలకిలా నవ్వింది. కార్లో ఇద్దరూ బయలుదేరారు. ఇల్లు చేరారు. దార్లోనే కావాల్సినవన్నీ డ్రైవరు చేర్చాడు.

"ఈరోజు మనం మనసు పరిచి మాట్లాడుకుందాం" బాటిల్ పైకి తీశాడు.

"అదేవిటీ?"

"ఈరోజు నేను పార్టీ ఇస్తున్నాను. నో అంటే నామీదొట్టే!"

రెండు గ్లాసుల్లో రాయల్ సెల్యూట్ పోశాడు. ప్రియ ఇబ్బందిగా మొహం పెట్టింది.

"స్టఫ్ చాలా వుంది. కమాన్ టేకిట్" గ్లాసందించాడు.

"మనం అడ్వాన్స్‌వుతున్నాం.."

"కాదు... దగ్గరవుతున్నాం! ఛీర్స్..!" అంటూ సిప్ చేశాడు. ప్రియ మాధవ్‌ని ఫాలో అయ్యింది.

"నువ్వు చాలా అందంగా వుంటావు ప్రియా!"

"ఈ మాట కొన్ని కోట్లసార్లు చెప్పేరు"

"నీలో ఏదో మత్తుంది!"

"నాకూ... ఏదో... గమ్మత్తుగా వుంది!"

గ్లాసులు ఖాళీ అవుతున్నాయి. మత్తు పదింతలవుతోంది.

"ప్రియా! నువ్వు నాక్కావాలి!"

"నాకూ... అలాగే వుంది. ఇప్పుడెలా వుందంటే...."

"స్వర్గం కనిపిస్తుంది" ప్రియని మాట్లాడనివ్వలేదు. ప్రియ అతడ్ని ప్రతిఘటించనూలేదు.

* * *

మాధవ్ కళ్లు తెరిచేసరికి తన బెడ్‌మీదున్నాడు.

'లత' అలవాటుగా బెడ్ కాఫీ అందించింది. మత్తు దిగిపోయింది.

"అరె... నువ్వెప్పుడొచ్చావ్? నేనెలా వచ్చాను? తలనెప్పిగా వుంది. టాబ్లెటుందా?" తడబడుతూ అడిగాడు.

"అవసరం లేదు. ఆఫీసుకెళితే అదే తగ్గిపోతుంది"

మాధవ్‌కి మతి పోతోంది. లత ఇల్లు పీకి పందిరేస్తుందనుకున్నాడు. 'లత'లో మార్పు లేదు.

అదే చిరునవ్వు... అవే సపర్యలు... అదే సాగనంపు.

"లతా! యు ఆర్ గ్రేట్!" అనుకున్నాడు మనసులో.

ఆఫీసులో మాధవ్ ఇంకా బిజినెస్ పెంచాలన్న పట్టుదలతో వున్నాడు. ప్రియ మాటలమీద గురి బాగా కుదిరింది. ఆఫీసులో ఆమె చెప్పిందే వేదం. ఆమె మాటకి ఎదురుచెప్తే ఎవరైనా ఎంతటివారైనా సస్పెండ్ చేసిన సందర్భాలు చాలా వున్నై. స్టాఫ్ హెడ్డాఫీసులో మొర పెట్టుకున్నా ఫలితం శూన్యం.

ప్రియ ఆడింది ఆట... పాడింది పాటగా చెలామణి అవుతోంది. ప్రియ మొదట్లో మాధవ్‌కి రెగ్యులర్ పార్టీ ఇచ్చేది. తరవాత వీకెండ్ పార్టీ.... ఆ తర్వాత మంత్లీ వన్స్. ఇపుడు మాధవ్‌కి దూరంగా వుంటోంది. మాధవ్ నరకం అనుభవిస్తున్నాడు. ఆఫీసులో స్టాఫ్ ఎవరూ తన మాట వినడం లేదు. ఇపుడు ఆఫీసూ, హెడ్డాఫీసు ప్రియ జపం చేస్తున్నారు.

ఒకరోజు హెడ్డాఫీసునించి స్క్వాడ్ వచ్చారు. ప్రియతో చాలాసేపు మంతనాలు జరిపేరు. ఏవేవో ఫైల్సూ, డాక్యుమెంట్లూ రిఫర్ చేశారు. తర్వాత మాధవ్ కేబిన్‌కి వచ్చి "మిస్టర్ మాధవ్! మిమ్మల్ని సస్పెండ్ చేస్తున్నాం!" అన్నాడు అధికారి.

ఆ మాటకి మాధవ్ వికృత చేష్టలతో విసిగిపోయిన స్టాఫ్ అందరూ చప్పట్లు కొట్టారు.

మాధవ్ గుండె మండిపోయింది.

"వాటీజ్‌దిస్... మీరేం చేస్తున్నారో నాకర్థం కావడం లేదు. వాటీజ్ రాంగ్ విత్ మీ! అయోమయంగా అడిగాడు, మాధవ్.

"ఎవ్విరీథింగ్ ఈజ్ రాంగ్. రాంగ్ డాక్యుమెంట్స్ పెట్టుకొని నకిలీ పత్రాల మీద కొన్ని కోట్లు లోన్లు మంజూరు చేసేశారు. మమ్మల్నీ మభ్యపెట్టారు. హెడ్డాఫీసు దీన్ని సీరియస్‌గా తీసుకుంది. మీ నిజాయితీని నిరూపించుకున్న తర్వాత ఆఫీసులో అడుగుపెట్టండి. యు కెన్ గో!" అన్నారు. ప్రియకి వెల్‌కమ్ చెప్పి మేనేజర్ సీట్లో కూర్చోబెట్టారు.

ఆమెకు స్టాఫ్ అభినందనల వెల్లువ. ప్రతిమలా వుండిపోయాడు మాధవ్.

"ప్రియా! వాటీజ్ దిస్.నీకు తెలియకుండా నేనేం చెయ్యలేదు కదా! దీనికి సంజాయిషీ చెప్పవలసిన బాధ్యత నీకు లేదంటావా? నువ్వు నన్ను కావాలనే ఇరికించావ్. యూ చీట్!" అంటూ ముందుకురికాడు.

"సెక్యూరిటీ... ఈ పిచ్చోడ్ని బైటికి పంపించు" అరిచింది ప్రియ.

అందుకు సెక్యూరిటీతోబాటు స్టాఫ్ కూడా సహకరించారు.

"యూ డెవిల్! నా జీవితం నాశనం చేశావ్. నా భార్య, బిడ్డల్ని కాకుండా చేశావ్!" మనసులో ఎన్నో తిట్టుకున్నాడు. జీవచ్ఛవంలా ఇంటికెళ్లాడు.

ఇంట్లో అడుగు పెట్టగానే లత మాధవ్ నోట్లో స్వీటు పెట్టింది.

"ఏం! నీక్కూడా వేళాకోళంగా వుందా? ఇపుడు నా పొజిషను తెలిసే ఎగతాళి చెయ్యడానికి స్వీటు పెడుతున్నావా?" ఉక్రోషంగా అడిగాడు.

"మీరేమిటి? మీ పరిస్థితేంటి? మీ మనస్థితేమిటి? అని నేనెప్పుడూ ఆలోచించలేదు. మీరు నా భర్త. నేను మీ భార్య. నాకు సాఫ్ట్‌వేర్ కంపెనీలో ఉద్యోగం వచ్చింది" అంది లత తాపీగా.

మాధవ్‌కి ఆనందంతో గర్వపడాలో సిగ్గుపడాలో తెలియని పరిస్థితి.

"నువు.... నువు వుద్యోగంకోసం అప్లై చేశావా? నాకు చెప్పలేదే?"

"మీరు నాకేవిషయం చెప్పారని? అయినా నేనంత నీతిమాలిన పని ఏం చేశానని?" చదువుకున్నాను. ఆర్థిక అవసరాలు కనిపించాయి. బాబు పెద్దవాడవుతున్నాడు. మీరు ఇంటిని పట్టించుకోవడం మానేశారు. ఒకరి వద్ద చెయి చాచకుండా బతకాలనిపించింది. మీ మనసుని బాధపెడితే క్షమించండి!" అంటూ డైనింగ్ టేబుల్ దగ్గరికి నడిచింది... వడ్డించింది. అన్నీ తనకిష్టమైన వంటకాలే.

"సారీ లతా! అయామ్ వెరీ... వెరీ... సారీ!" పసిపిల్లాడిలా బావురుమన్నాడు.

"ఎందుకూ?" తనకీ కళ్లల్లో నీళ్లు తిరిగాయి.

"నిన్నర్థం చేసుకోలేకపోయాను. పైపై మెరుగులకు లొంగిపొయ్యాను. అత్యాశలకు పోయి ప్రాణాల మీదకి తెచ్చుకున్నాను. వుద్యోగం పోగొట్టుకున్నాను!"

"అందుకు కారణం ఏమై వుంటుందో ఆలోచించండి. మీ నిజాయితీని నిరూపించుకోండి. అయినా మనమేం వీధిన పడటం లేదుగా! భగవంతుని దయతో నాకుద్యోగం దొరికిందిగా! వున్నంతలో గుట్టుగా సంసారం చేసుకుందాం. నేనారోజూ.. ఈరోజూ.. ఏ రోజైనా కోరుకొనేది స్థిరమైన ప్రేమ. అది నాకు దక్కితే చాలు!" ఆ తర్వాత మాట్లాడ లేకపోయింది లత. మాధవ్‌ని తడికళ్లతో ఊరడిస్తూ 'లత'లా అల్లుకుపోయింది. ■

## కార్టూన్లకు ఆహ్వానం

కార్టూనిస్టులనుండి ఆరోగ్యకరమైన హాస్యాన్ని అందించే కార్టూన్లను స్వాగతిస్తున్నాం. అంశం ఏదైనా సరే! మంచి హాస్యాన్ని అందించాలి. కార్టూన్లతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని కార్టూన్లను తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి.

కార్టూన్లు పంపించాల్సిన చిరునామా:

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్-80.**

# జగన్నాటకం

**ఒక** తరం....
జన్మనిచ్చిన తల్లిదండ్రులు
ఆదరించిన అత్తమామలు
పెద్దమ్మలు-పెదనాన్నలు
గురువులు-పెద్దలు
ఒక్కొక్కరుగా ఒరిగిపోతూంటే
కాలి బుగ్గై కాలగర్భంలో కలుస్తూంటే
పది రోజుల పరితాపంలో
జీవితం భ్రమ అన్న సత్యం బోధపడింది.

మరో తరం...
కొడుకులు-కూతుళ్లు
మేనల్లుళ్లు-మేనకోడళ్లు
చిన్నారులు-చిట్టితల్లులు
అనురాగం కురిపిస్తూ
ఆటపాటలతో అలరిస్తూ
కళ్లముందే ఎదుగుతూంటే
జీవితం సత్యమనే భ్రమలో మునిగాను.

ఏ క్షణమైనా ఆఖరి క్షణమే అని తెలిసీ...
క్షణికోద్రేకాలెందుకో...
రోషాలు-ద్వేషాలు-పంతాలు-పట్టింపులు
కక్షలు-కార్పణ్యాలు-హత్యలు-ఆత్మహత్యలు
ఎందుకింత అల్లరి...
ఏమిటింత అమాయకత్వం...
వదిలేద్దాం... దురాలోచనలు... దుష్కర్మలు
మనసులో మాలిన్యాన్ని కడిగేద్దాం....
ఊపిరి ఉన్నంత కాలం ఉత్సాహంగా
ప్రాణం పోయేవరకు ప్రేమను పంచుతూ
బతికేద్దాం...
సమస్త ప్రాణికోటినీ స్వేచ్ఛగా బతకనిద్దాం.

– ఇంద్రగంటి నరసింహమూర్తి

# నెలవంక

**ఆ**కశాన నెలవంక
తొంగిచూసె నా వంక
చిరునవ్వుల పలకరింత
తనువెల్లా పులకరింత

పారిజాత సౌరభాలు
మల్లెల గుబాళింపులు
తట్టి లేపాయి మదితలపులు
నిద్ర లేచె చిరుకోరికలు

కొంటెతనపు వలపులు
పలవరించె చెలియ సొగసులు
ఘడియ ఘడియ నిట్టూర్పులు
మరీ పెంచెను కొత్త ఆశలు

ఝాములు మింగిన నిశినీడలు
తొలగిపోతున్నాయి రాతిరి తెరలు
జాడలేని ప్రియురాలు
వదలిపోయే కమలం కళ్లు

జారుతున్న నెలవంకా
తెలుపరాదా చెలియకింక
సఖి లేని హృదయమింక
స్పందించదు క్షణమింక

– అవధానం అమృతవల్లి

# గుండె 'గీతం'

**ఊ**యలలో వుండగా జోలగా
అడుగులేస్తున్నప్పుడు లాలగా
విద్యార్థి దశలో వేడుకగా
యుక్త వయసులో కానుకగా
ఎప్పటికీ వీడని వాడుకగా
నాలో కదులుతూ నన్ను కదిలిస్తూ
వాడని సుమ పరిమళంగా వుంది...
ఆలోచనలు ముసురుకున్న వేళ
ఆలాపనగా ఆహ్లాదపరుస్తుంది
చిరాకులు కసురుతున్న వేళ
సరాగాలతో స(ప) రదా పరుస్తుంది

జీవితం ప్రశ్నగా తేలితే
పాటే సమాధానంగా మారుతుంది
జీవితం సమస్యగా మారితే
పాటే పూరణంగా తీరుస్తుంది.

స్నానం చేసేటప్పుడు పాడే గీతాలు
పైరగాలిలా హుషారు రప్పిస్తాయి
పడక గదిలో తీసే రాగాలు
పిల్లతెమ్మెరలా తిమ్మిరెక్కిస్తాయి...

పాటతోనే నా గమనం
పాట ద్వారానే నాకు గమ్యం
పాట తోడుగా విశ్వమంతా విహరిస్తా
పాట గుండెలో శాశ్వతంగా
వినోదిస్తా...

పాటంటే నాకు సత్యనేస్తం
మాత్రమే కాదు
నిత్యనూతన జీవిత సమస్తం

– బొగ్గరపు రాధాకృష్ణమూర్తి

## రచనలకు ఆహ్వానం

రచయితలనుండి కథలు, కవితలు, సమకాలీన వ్యాసాలు స్వాగతిస్తున్నాం. రచనలతోపాటు మీ పేరు, చిరునామా, హామీపత్రం తప్పనిసరిగా జతచేయాలి. ఎంపిక కాని రచనలు తిప్పి పంపగోరేవారు తగిన పోస్టేజీ జత చేసిన కవరు పంపించాలి. ఇతర పత్రికల పరిశీలనలో ఉన్న రచనలు పంపించకండి. **రచనలు పంపించాల్సిన చిరునామా:**

**ఎడిటర్, ఆదివారం వార్త నం.396, లోయర్ ట్యాంక్‌బండ్, డిబిఆర్ మిల్స్ పక్కన, హైదరాబాద్-80**




# ప్రేమపరీక్ష

– కూచిభట్ల శ్రీనివాసశాస్త్రి

**అందాల** బొమ్మ సుప్రియ కాలేజిలో చేరింది మొదలు అమ్మాయిల వెంటపడే విద్యార్థులందరికి ప్రతి క్షణం గుండెల్లో అలజడి చెలరేగసాగింది. కొత్తగా చేరిన జూనియర్స్‌ను ర్యాగింగ్ చేసే సీనియర్స్ కూడా ఆమెని ర్యాగింగ్ చేయకుండా ఆమె అందానికి దాసోహం అన్నారు. జూనియర్స్‌లోను, సీనియర్స్‌లోను ఆమె నామ జపం చేసేవాళ్లు చాలా మంది వున్నారు. ఆమె తనవంక చూసిందని ఒకడు, తనమీద చిరునవ్వు విసిరిందని మరొకడు, తనని నోట్సు అడిగిందని వేరొకడు– ఇలా ఒక్కొక్కడు ఒక్కొక్క రొమాంటిక్ అనుభూతిగా భ్రమపడుతూ ఆ అందాల రాశి తనని ప్రేమిస్తోందనే పగటి కలల్లో విహరించసాగారు. అటువంటి వాళ్లలో సీనియర్స్‌లో ర్యాగింగ్ చేసే గ్యాంగ్ లీడర్ రాహుల్ ఒకడు. అతను అందరికంటే ఫాస్ట్‌గా, అందరూ చూస్తుండగానే ఆమె వెనకాల పడటం, ఆమెని తాకటానికి ప్రయత్నించటం చేసేవాడు. ఆమె క్యాంటీన్‌కి వెళ్తే అతను ముందుగా అక్కడికి వెళ్లి తనకి, ఆమెకి రెండు కాఫీలు ఆర్డర్ చేసేవాడు. కాఫీ తాగుతూ ఆమె గురించిన వివరాలు రాబట్టటానికి ప్రయత్నించేవాడు. కాలేజి అయిన తరువాత అతనామెను సంభాషణలోకి దింపటానికి ప్రయత్నిస్తే–

ఆమె అతన్నించి తప్పించుకోవటానికి "నాకు ఇంటిదగ్గర అర్జెంట్ పనుంది. నేను వెంటనే వెళ్లాలి" అనేది.

"నిన్ను క్షణాల్లో నా బైక్‌మీద తీసుకువెళ్లి నీ ఇంటిదగ్గర దించుతాను. కానీ నేను చెప్పే ముఖ్య విషయం విను. నిన్ను మొదటిసారి చూసిన వెంటనే లవ్ ఎట్ ఫస్ట్ సైట్ అన్నట్టు నీ మీద ప్రేమ కలిగింది. నా ప్రేమను కాదంటే నేను బతకలేను. నా ప్రేమను స్వీకరించు, ప్లీజ్" అని బతిమాలేవాడు. కానీ ఆమె సమాధానం చెప్పకుండా వెళ్లిపోయేది. అలా రోజూ ఆమె వెంట పడుతూ ఆమెకి ఒక సమస్యగా తయారయ్యాడు.

సుప్రియ తండ్రి రాఘవరావు ఒక మధ్య తరగతి గుమాస్తా. కట్నకానుకలిచ్చి ఆమె పెళ్లి చేసే ఆర్థిక స్థోమతు లేక ఆమెను కాలేజిలో చేర్పించాడు. డిగ్రీ చేసి ఒక ఉద్యోగం చేస్తూ పెళ్లికి కావాల్సిన కట్నకానుకలు తనే సంపాదించుకుంటుందని ఆయన ఉద్దేశం.

రాహుల్ తండ్రి ఒక మిలియనీర్. రాహుల్ ఒక్కడే సంతానం కావటంతో అతను గారాబాల కొడుకయ్యాడు. కానీ చదువులో అన్ని సబ్జెక్ట్‌లో అతనికి సింగిల్ డిజిట్ మార్కులు వచ్చేవి.

సుప్రియ ప్రాణ స్నేహితురాలు సురేఖ. రాహుల్ సుప్రియ వెంట పడకుండా వుండటానికి సురేఖ అతనిమీద ప్రిన్సిపాల్‌కు కంప్లైంట్ ఇవ్వమని సలహా ఇచ్చింది. కానీ అలా చేస్తే కాలేజిలో తన గురించి అల్లరి అవుతుందనీ, తన తండ్రి తట్టుకోలేడనీ సుప్రియ ఆ సలహాను తోసిపుచ్చి, అతని పీడను వదలుచ్చుకోవటానికి ఒక ఉపాయం ఆలోచిస్తానని చెప్పింది. సుప్రియ చదువుతున్న సెక్షన్‌లో మురళి అన్ని సబ్జెక్ట్స్‌లో, అన్ని పరీక్షల్లో ఫస్ట్ మార్కులు తెచ్చుకుంటూ లెక్చరర్లందరి మంచి దృష్టిలోకి వచ్చాడు. స్టూడెంట్స్ అందరూ అతన్ని గౌరవంగా చూసేవాళ్లు. అతనితో స్నేహంగా వుండి అతనితో సహకరించేవాళ్లు. అమ్మాయిలు కూడా అతని స్నేహాన్ని కోరుకునేవాళ్లు.

చదువుతోనే కాక, తన సత్ప్రవర్తనతో కూడా అతను సుప్రియ మనసులో అతనికి తెలియకుండానే చోటు సంపాదించుకున్నాడు. అతని ప్రేమకోసం సుప్రియ తహతహలాడేది. ఆమె చదువులో సగటు స్థాయిలో ఉండేది. ఏదైనా సబ్జెక్ట్‌లో సందేహాలున్నప్పుడు సుప్రియ అతని దగ్గరకు వెళ్లి అతని వివరణ ద్వారా వాటిని తొలగించుకుని ఆ సబ్జెక్ట్‌ను బాగా అర్థం చేసుకునేది. అందరూ సుప్రియ కోసం పరితపిస్తూంటే ఆమె మురళి ప్రేమను కోరుకునేది.

అతని ప్రాణ స్నేహితుడు కుమార్ ఒకరోజు "సుప్రియ గురించి నీ అభిప్రాయం ఏంటి? నువ్వంటే ఇష్టపడుతున్నట్టు ఆమె మాటల్లో, చేతల్లో స్పష్టంగా తెలుస్తోంది. నువ్వు ప్రయత్నిస్తే ఆ అందాల రాణి ప్రేమ నీకు తప్పకుండా దక్కుతుంది" అని ప్రోత్సహిస్తూ అన్నాడు.

మురళి నవ్వుతూ "నువ్వు అన్నట్టు సుప్రియ దివినుంచి భువికి దిగి వచ్చిన దేవతలాగా అందాలన్నింటిని సొంతం చేసుకుంది. కానీ ఆమె చేతిని అందుకునే అదృష్టవంతుడెవరో?" అన్నాడు.

"ఆ అదృష్టవంతుడు తప్పకుండా నువ్వే అవుతావని నాకు గట్టి నమ్మకం వుంది" అన్నాడు, కుమార్ అతనితో కల్సి నవ్వుతూ.

"దేనికైనా సమయం, సందర్భం కల్సిరావాలి. అంతా కాలమే నిర్ణయిస్తుంది" అన్నాడు మురళి.

అతను కూడా మధ్య తరగతివాడే. అతను కాలేజిలో చేరిన కొద్ది రోజుల్లో అతని తల్లితండ్రులు ఒక యాక్సిడెంట్‌లో చనిపోయారు. అతను ఒంటరివాడయ్యాడు. అతని తండ్రి ఒక పెద్ద ఇంటిని స్థిరాస్థిగా మిగిల్చిపోయాడు. ఆ ఇంటిలో ఒక భాగాన్ని అద్దెకిచ్చి ఆ అద్దె డబ్బుతో మురళి తన కాలేజి చదువు ఖర్చులకు పోగా మిగిలిన డబ్బు జాగ్రత్తగా... పొదుపుగా వాడుకుంటూ, తెలివిగా సమర్థించుకు వస్తున్నాడు. డిగ్రీ చదువు పూర్తి చేసి ఒక ఉద్యోగంలో స్థిరపడాలని అతని ఉద్దేశం.

మురళి కూడా సుప్రియను గాఢంగా ప్రేమిస్తున్నాడు. కానీ తన ప్రేమను గుండెల్లో దాచుకున్నాడు. అవకాశం వచ్చినప్పటికీ అతనామెతో తన ప్రేమను గురించి చెప్పలేదు. ఆమె వెంట ఎన్నడూ పడలేదు. విధి నిర్ణయం ప్రకారమే జరుగుతుందని అతని నమ్మకం.

రాహుల్ సుప్రియ వెంట పడుతూ ఆమెను తన ప్రేమగోలతో రోజూ వేధిస్తున్నాడు. ఒకరోజు ఆమె సురేఖతో కల్సి రాహుల్ పీడ వదలుచ్చుకోటానికి ఒక ఉపాయం ఆలోచించింది.

రోజూలాగే అతను సుప్రియ దగ్గరకి వచ్చినప్పుడు ఆమె "రాహుల్! నువ్వు నన్ను వదిలిపెట్టలేనంతగా ప్రేమిస్తున్నానని చెప్పావు. ఈ సాయంకాలం కాలేజి అవర్స్ అయిన తరువాత నీ ఫ్రెండ్స్ ఎదుట, నా ఫ్రెండ్స్ ఎదుట నా మీద నీకున్న ప్రేమను నిరూపించుకోవాలి" అంది.

అతను సంతోషంతో ఉక్కిరి బిక్కిరై ఎగిరి గంతేశాడు. వెంటనే ఓ.కె.అన్నాడు. సాయంకాలం రాహుల్ అతని స్నేహితులతో,సుప్రియ ఆమె స్నేహితురాళ్లతో ఒకచోట సమావేశమయ్యారు. సుప్రియ తన హ్యాండ్ బ్యాగ్‌లోనుంచి ఒక తాళిని బయటికి తీసి, నా మీద నీకున్న ప్రేమ నిజమైతే ఈ తాళిని నా మెడలో కట్టు" అంది.

అందరూ ఏం జరుగుతుందా? అని ఆసక్తిగా ఎదురు చూస్తున్నారు. అతను తెల్ల మొహం వేశాడు. ఇటువంటి ప్రేమపరీక్ష ఎదురవుతుందని అతను ఊహించలేదు. ఆమె చేతిలోని తాళిని తీసుకునే ధైర్యం అతనికి లేదు. ఎందుకంటే అతని తండ్రి అతనికొక మిలియనీర్ కూతురితో పెళ్లి చేయాలని నిశ్చయించినట్టు అతనికి తెలుసు. సుప్రియ ప్రేమకోసం ఆయన్ని ఎదిరించే ధైర్యం అతనికి లేదు. అందుచేత మౌనంగా వుండిపోయాడు.

"రాహుల్! నువ్వేం చెయ్యదలచుకున్నావ్?" అని అందరికీ వినిపించేలా సుప్రియ గట్టిగా రెట్టించి అడిగింది.

అతను తలొంచుకుని "ఐయాం సారీ" అన్నాడు.

వెంటనే మురళీ ముందుకు వచ్చి ఆ తాళిని తీసుకుని ఆమె మెడలో కట్టి సంతోషంతో "మ్యారేజెస్ ఆర్ మేడ్ ఇన్ హెవెన్" అని అందరినీ ఆశ్చర్యపరిచాడు.

సుప్రియ ఆనందంతో పరవశించింది. కుమార్ చాలా సంతోషించాడు. రాహుల్ తన తప్పును తెలుసుకుని నూతన దంపతులకు శుభాకాంక్షలు చెప్పాడు. రాఘవరావు తన కూతురి పెళ్లి ఏ పరిస్థితిలో జరిగిందో ఆమె ద్వారానే తెలుసుకుని యోగ్యుడైన మురళి అల్లుడైనందుకు సంతోషించేవాడు. తాత్కాలికమైన బాహ్య సౌందర్యపు ఆకర్షణని ప్రేమనుకొని భ్రమపడి రాహుల్ ప్రేమ పరీక్షలో ఓడిపోయాడు. అతని ప్రేమ కేవలం మాటలకే పరిమితమైంది.

స్థిరమైన నిస్వార్థ ప్రేమను,విధిని నమ్మి మురళి సుప్రియ మెడలో తాళికట్టి చేతల్లో తన ప్రేమను నిరూపించి ప్రేమపరీక్షలో నెగ్గాడు. ■

# కంకవేధ అంటే ఏమిటి?


## వాస్తువార్త

వాస్తువిద్వాన్ సాయిశ్రీ

డా॥ దంతూరి పండరినాథ్

3-2-4, కింగ్స్‌వే, సికింద్రాబాద్- 3

సెల్స్: 9885446501/ 9885449458


**గృహ** గర్భానికి నాలుగు వైపులగానీ, రెండు వైపులగానీ వసారాలను సమానంగా వుంచాలి. అలాగాక బేసి సంఖ్య వసారాలను నిర్మించినా, హెచ్చు తగ్గులుగా వసారాలను నిర్మించినా 'పార్శ్వ హీనం తథాకంక' అనే లక్షణానుసారం 'కంకవేధ' దోషం కలుగుతుంది.

ఇలాంటి వేధ కలిగే గృహంలో నివసించేవారు, గృహ యజమాని దారిద్ర్యాన్ని అనుభవించవలసి వస్తుంది. కాబట్టి ఒక గృహానికి వసారాలను ఏర్పరచుకోవలసి వస్తే, తప్పకుండా అందుకవసరమయిన వాస్తు నియమాలను పాటించాలి. ఒకవేళ ఇలాంటి వేధను కలిగిన ఇంట్లో నివసిస్తూ దారిద్ర్య బాధలను అనుభవించేవారు వారి బాధలకు కారణం 'కంక వేధ' దోషం అని తెలుసుకొని వసారాలను వాస్తు నియమానుసారం సరిచేసుకున్నట్లయితే తప్పకుండా దారిద్ర్య బాధల నుండి విముక్తి పొందగలుగుతారనటంలో సందేహం లేదు.

### కలిశ వేధ

ఇంటి ప్రధాన ద్వారం ఏ ఆయుధం చేతనయినా పూర్తిగా లేదా పాక్షికంగా ధ్వంసం కాబడినప్పుడు(కొట్టబడుట/నరకబడుట) ఆ గృహానికి 'కలిశ వేధ' దోషం సంక్రమిస్తుంది. ప్రధాన ద్వారంగాక ఏ ఇతర ద్వారం గానీ, గొడ్డలి, గునపం మొదలయిన ఆయుధంచేత పూర్తిగా గాని పాక్షికంగాగానీ ధ్వంసమైనా ఇదే దోషం ఆ గృహానికి ప్రాప్తిస్తుంది.

సింహద్వారం ధ్వంసం కాబడటం వలన దోష తీవ్రత ఎక్కువగా వుంటుంది. అలాంటి గృహంలో వుండేవారు కోలుకోలేనటువంటి తీవ్ర నష్టాలు పొందే అవకాశం ఉంటుంది.

'కులిశ్ నహతో ద్వారో గృహాంతస్థే మృతిర్భవేత్' కులిశవేధ దోషమున్న గృహంలో నివసించేవారికి మరణం సంభవించునని దీని తాత్పర్యం. అందుకని ఇలాంటి దోషాలను తీవ్రంగానే పరిగణించి వెనువెంటనే దోషపూరిత ద్వారాలను తీసివేసి కొత్త ద్వారాలను వాస్తు నియమానుసారం ప్రతిష్ఠించుకొనటం అన్ని విధాల మంచిది. నష్టం కలిగేవరకు వేచి చూడకుండా ముందే జాగ్రత్త పడటం తప్పనిసరి. ఆయుధంచేత కొట్టబడిన ద్వారాలపైన ఏర్పడిన పగుళ్లను, రంధ్రాలను కనిపించకుండా లప్పం, మైనం మొదలయిన వాటితో సరిచేయటం వలన ఉపయోగం ఉండదు. తప్పనిసరిగా కొత్త ద్వారాలను ప్రతిష్ఠించవలసిందే!




### ఈ స్థలానికి 'రోడ్డుశూల' వుందా?

**మల్లారెడ్డి - పశ్చిమ గోదావరి జిల్లా**

**ప్రశ్న: ఈ స్థలం ఇల్లు కట్టుకోవడానికి పనికి వస్తుందా? లేదా?**

**ఈ స్థలానికి దక్షిణ ఆగ్నేయంలో 'రోడ్డుశూల' వుందని అంటున్నారు.**

**జవాబు:** 'దక్షిణ ఆగ్నేయ వీధిచూపు' మంచి ఫలితాల నిస్తుంది. తూర్పు ఆగ్నేయ వీధిపోటు మంచి ఫలితాలని వ్వదు. 60 అడుగుల దక్షిణ భుజానికి ఎన్ని అడుగుల తరువాత, దక్షిణ ఆగ్నేయంలో ఎన్ని అడుగుల వీధిచూపు తగులుతున్నదో స్పష్టంగా తెలుపలేదు. ఆ కొలతలనుబట్టి ఈ వీధిపోటు/చూపు కలిగిన స్థలాన్ని ఎలా సవరించుకోవాలో తెలుపవచ్చు.

### తూర్పున ఖాళీస్థలమెంత ఉండాలి?

**వాసుదేవరావు - కదిరి**

**ప్రశ్న: మాది తూర్పు ముఖ ద్వార ఇల్లు. మా ఇంటికి తూర్పున ఎక్కువ ఖాళీ స్థలం వదిలే అవకాశం లేదు. అందుకని పడమరలో వదిలిన ఖాళీ స్థలం ఒక్క అడుగు మాత్రం ఎక్కువ ఖాళీ స్థలం వదిలాం. సరిపోతుందా? అసలు శాస్త్ర ప్రకారం తూర్పున ఎంత ఖాళీ స్థలం వదలాలి?**

**జవాబు:** ముఖద్వారం ఎటువైపున వున్నప్పటికీ ఒక గృహానికి నాలుగు దిక్కుల్లో వదలవలసిన ఖాళీ స్థలానికి శాస్త్ర ప్రకారం నియమాలున్నాయి. గృహానికి పడమర దిక్కున వదిలిన ఖాళీ స్థలం కంటే రెట్టింపు ఖాళీ స్థలం తూర్పు దిక్కున వదలాలి.

అలాగే దక్షిణ దిక్కున వదిలిన ఖాళీ స్థలానికి రెట్టింపు ఖాళీ స్థలం ఉత్తర దిక్కున వదలాలి. రెట్టింపు ఖాళీ స్థలాలు వదలడానికి వీలుగాని పక్షంలో ఎంతో కొంత ఎక్కువ ఖాళీ స్థలాలు వదలడం తప్పనిసరి.

అలాగే పశ్చిమ, దక్షిణ దిక్కుల్లో కనీసం మూడు అడుగుల నుంచి ఐదు అడుగుల వరకు ఖాళీ స్థలాలు వదలడం కూడా తప్పనిసరి.

### అందరికీ అనారోగ్య సమస్యలు!?

**- నారాయణ - కడప**

**ప్రశ్న: మా ఇంటి వాస్తు బాగా లేదేమోనన్న సందేహం కలుగుతోంది. ఎందుకంటే మా ఇంట్లో ఒకరి తరువాత ఒకరికి అనారోగ్య సమస్యలొస్తున్నాయి. ఇంటిప్లాను పంపిస్తున్నాం. మా సమస్యకు సరయిన పరిష్కారం తెలుపగలరు.**

**జవాబు:** ప్రతి అనారోగ్య సమస్యకు వాస్తు కారణం కాకపోవచ్చు. మీ ఇంటి ప్లాను పరిశీలించాను. మీరొకసారి ఫోన్‌లో సంప్రదించండి. పత్రికా ముఖంగా కాకుండా మీకునేరుగా సలహా చెప్పవలసి ఉంటుంది. ■

వాస్తువిద్వాన్ డా॥ దంతూరి పండరినాథ్ పాఠకుల సమస్యలకు ఆదివారం 'వాస్తువార్త'లో సమాధానాలిస్తారు. ఈ కింది కూపన్ జతచేసి సమస్యలు పంపవలసిన చిరునామా: సాయిశ్రీ వాస్తు కన్సల్టెన్సీ, 3-2-4, కింగ్స్‌వే, రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాద్-3

వాస్తువార్త

పూర్తి పేరు: ------------------------------------

పుట్టినతేదీ:------------------ ఊరు: ------------

జన్మనక్షత్రం:---------తల్లిపేరు:--------------------

చిరునామా: ------------------------------------

------------------- ఫోన్: ---------------------

## పర్సనల్ పాయింట్


చల్లా సుబ్రహ్మణ్యం
1 సి-ఐక్యూ టవర్స్, 3-4-540,
నారాయణగూడ, హైదరాబాద్-27
మొబైల్: 9866362224/ 9553662224
challascounsel@gmail.com
www.challascounsel.com




ఎస్.ఎన్.ఆర్ - అనంతపూర్ జిల్లా

ప్రశ్న: నా వయసు 27. మూడు సంవత్సరాలుగా ఒకమ్మాయిని గాఢంగా ప్రేమించాను. మా ఇద్దరి కులాలు వేరు. ఇద్దరం ఒకేచోట ఉద్యోగం చేస్తున్నాం. మాది చాలా స్వచ్ఛమైన, నిర్మలమైన అవగాహనతో కూడుకున్న ప్రేమ. ఇంట్లోవాళ్లు మా పెళ్లికి మొదట్లో ఒప్పుకోకపోయినా ఇప్పుడు కొంచెం మెత్తబడ్డారు. త్వరలో పెళ్లి చేసుకుందాం... అనుకుంటుండగా షాకింగ్ న్యూస్! నా కన్నా వయసులో 6 నె॥ చిన్నది అనుకుంటున్న సమయంలో ఆ అమ్మాయి ఒక సం॥ పెద్దదని తెలిసింది. అడిగితే- సారీ చెప్పింది. కానీ జీవితంలో ఒక ముఖ్యమైన విషయం గురించి అబద్ధం చెప్పిందనే బాధ ఒకవైపు, ఆయుక్షీణం కారణంగా పెళ్లి చేసుకోలేకపోతున్నాననే బాధ మరోవైపు నన్ను కుంగదీస్తున్నాయి. సలహా చెప్పండి.

# అమ్మాయి వయసు ఎక్కువైతే...

జవాబు: నన్నేం చెప్పమంటావ్! పెళ్లి వద్దని అనుకున్నాక ఇక నేను చెప్పేదేముంది? భార్య పెద్దదైతే ఆయుక్షీణం లాంటి అభిప్రాయాలు నీ నెత్తిన ఎవరు రుద్దారో తెలీదు. కానీ ఒక సైకాలజిస్ట్‌గా చెబుతున్నాను- అది కరెక్ట్ కాదు. పూర్వం సామాజిక, ఆరోగ్య పరిస్థితుల దృష్ట్యా సంతానోత్పత్తి, వయసు ఆడదానికన్నా మొగవాడికి ఎక్కువగా ఉండడంవల్ల పెళ్లి విషయంలో ఆడది 2 నుండి 5 సం॥ చిన్నదై ఉండడం మంచిదనే సంప్రదాయం వాడుకలోకి వచ్చింది. తను సంవత్సరం పెద్దదైనంత మాత్రాన ప్రపంచం తలకిందులైపోయేది ఏమీ ఉండదు. భార్యాభర్తల్లో 2-3 సంవత్సరాలు ఎవరు పెద్దవాళ్లయినా ఎలాంటి అభ్యంతరమూ, నష్టమూ లేదు.

### ఆమెను ఎలా నమ్మించాలి?

- కె కె - హైదరాబాద్

ప్రశ్న: సార్ నమస్తే! నాది ప్రేమ వివాహం. నా భార్య క్రిస్టియన్. నేను హిందువు. మా పెళ్లి జరిగి 29 ఏళ్లు. ముగ్గురు మగపిల్లలు. నేను ప్రైవేట్ గుమాస్తా పని చేసుకొని జీవించేవాడ్ని. నా భార్య మూడవ కాన్పుకోసం వచ్చిన తన స్నేహితురాలితో ఎఫైర్ పెట్టుకుని పెళ్లి చేసుకోవాలని ప్రయత్నిస్తే, నా భార్య నలుగురితో చెప్పి మా ఇద్దరినీ వేరు చేసింది. నేను మా పెద్దల ఒత్తిడితో ఎఫైర్ తెంచేసుకున్నాను. నా భార్య చాలా అందంగా ఉంటుంది. నేను మీడియంగా ఉంటాను. తను హిందూ సంప్రదాయాలను ఆచరించి, తిరుపతి, వేములవాడకు వెళ్లి వచ్చింది. నాకు మద్యం అలవాటు బాగా ఉండడంవల్ల ఓ రోజు ఫుల్‌గా మద్యం తాగి యాక్సిడెంట్‌కు గురయితే నా భార్య 2 లక్షలు అప్పు చేసి నన్ను కాపాడింది. నేను కోలుకున్నాక మద్యం తాగడం మానలేదు. దానితో నా భార్య పిల్లల్ని తీసుకుని వెళ్లిపోయింది. రెండు రోజుల తరువాత నా భార్య దగ్గరికి వెళ్తే "తాగుబోతు వెధవ.. నీవు వద్దు, నాకు ఏం తెచ్చిపెట్టావు? మా అమ్మదగ్గర తెచ్చిన యాభై వేలు నీ జల్సాలకు వెచ్చించావు.. నీతో విడాకులు కావాలని" అన్నది. నేను చాలా బాధపడి తిరుపతికి వెళ్లి గుండు చేయించుకుని, జీవితాంతం మద్యం ముట్టనని నా భార్యని బతిమాలాను. అయినా విడాకులు ఇస్తాననడంతో వెనక్కి వచ్చాను. నా భార్య నాకు విడాకుల నోటీస్ పంపింది. నాకు నా భార్య, పిల్లలతో జీవించాలని ఉంది. నా భార్య ఎలా మారుతుందో చెప్పగలరా?

జవాబు: విచ్చలవిడితనానికి, క్రమశిక్షణా రాహిత్యానికి ఏ పద్ధతీ లేకుండా ముగ్గురు పిల్లలతో సంసారాన్ని నట్టేట కలపడం చూస్తుంటే జాలి కాదు- బాధ, వేదన, అసహ్యం కలుగుతున్నాయి. ఎం.బి.ఏ. చదువుకున్నావు, ప్రేమించి మరీ మతాంతర వివాహం చేసుకున్నావు. చక్కగా ముగ్గురు పిల్లల్ని కన్నావు. అంత హాయిగా ఉన్న జీవితంలో పచ్చి తాగుబోతువై, ఏక్సిడెంట్‌లు చేసుకుని, లక్షల ఖర్చులు నీ భార్య నెత్తినేసావు. నీ భార్య డెలివరీలో సహాయం చేయడానికి వచ్చిన ఆమె స్నేహితురాలితోనే ఎఫైర్ పెట్టుకున్న నిన్ను ఏమని అర్థం చేసుకోగలను నాయనా! నాకంత శక్తి లేదు. నువ్వు మంచివాడిగా మారిపోయావనీ, నీ భార్య ఎంత చెప్పినా ఒప్పుకోవడం లేదు. కనుక ఆమెని నమ్మించి కాపురానికి ఒప్పించే బాధ్యత ఎంతో దయతో నా మీద పెట్టాలనుకున్నావు, నీ సహృదయం నా కర్థమైంది. కానీ ఆ పని నేను చేయలేను. ఎందుకంటే నేను నిన్ను నమ్మలేను కనుక. నీ భార్య విశ్వాసాన్ని చూరగొనడం, ఆమెకు నీ మీద నమ్మకం కలిగేలా చేసుకోవడం నీ బాధ్యత. నీ ప్రస్తుత పరిస్థితుల్లో ఆమె నిన్ను నమ్మదు. ఆమె నిన్ను నమ్మాలంటే- ముందు నిన్ను నువ్వు నమ్మాలి. నీ మీద నీకు నమ్మకం కలగాలంటే నీ వ్యక్తిత్వం, జీవన విధానం, ఆలోచనా దృక్పథం- ఇవన్నీ మారాలి. ఆ మార్పులనీ తెచ్చుకోవడం నీ చేతుల్లో లేదు. అందుకే నువ్వు వెంటనే ఫ్యామిలీ కౌన్సెలర్‌ని కలవాలి. ఆల్ ది బెస్ట్. ■

---

# చదువుపట్ల ఏమాత్రం ఆసక్తి లేదు!

కె.ఎల్.ఆర్ - వైజాగ్

ప్రశ్న: మా అమ్మాయి బి.టెక్. మూడవ సంవత్సరం చదువుతోంది. బిటెక్‌లో చేరడంలో తనకు పెద్దగా ఇష్టం లేకపోయినా మా వారు, మా అత్తగారు, మా తమ్ముడు... అందరూ కలిసి ఒప్పించి చేర్పించారు. బి.టెక్.లో పెర్ఫార్మెన్స్ బాగానే వుంది. కానీ అమ్మాయి దేనిపట్లా అంత ఆసక్తిగా ఉండటం లేదు. ఏదో రొటీన్‌గా కాలేజికి వెళ్లొస్తోంది. ఉత్సాహంగా స్నేహితులతో, బంధువులు, పార్టీలు దేన్నీ ఎంజాయ్ చేయడం లేదు.

తన డిగ్రీ పూర్తవగానే జి.ఆర్.ఇ. రాయించి ఎం.ఎస్. కోసం అమెరికా పంపటం (అంటే మా తమ్ముడి దగ్గరకు) మా ఉద్దేశం. తనేమో జీమ్యాట్ రాసి ఎం.బి.ఏ. చదువుతానంటోంది. లేదా గ్రూప్స్ రాసి గవర్నమెంట్ ఉద్యోగంలో సెటిల్ అవుతానంటోంది. ఇంత తెలివైన పిల్ల గవర్నమెంట్‌లో పని చేయడం ఏంటనీ? మా వారు బాధ పడుతున్నారు. ఏం చేయాలో అర్థం కావట్లేదు.

జవాబు: ఇందులో అర్థం కావడానికే ముంది? అమ్మాయికి ఇష్టంలేని కోర్సులో చేర్పించారు. అయినా చేరినందుకు కష్టపడి బాగానే లాక్కొస్తోంది.

ఇష్టంలేని పని చేసేటపుడు ఏ పనిలోనైనా ఉత్సాహం ఎక్కడ్నుంచొస్తుంది? చెప్పండి. అమ్మాయి నిరుత్సాహం పెళ్లిదాకా పాకకుండా జాగ్రత్త తీసుకోవడం అత్యవసరం. అందరూ కలిసి అమ్మాయి మీద ప్రయోగాలు చేయడం ఆపి అర్జంట్‌గా తీసుకురండి. తన వ్యక్తిత్వం, ఆసక్తినిబట్టి ఏ వృత్తి తనకు సరిపోతుందో చూద్దాం. మీరందరూ కోరుకుంటున్నట్లు జిఆర్ఇ, ఎం.ఎస్.కి నేను మొగ్గు చూపను. నాకు కావాల్సింది మీ అందరి తృప్తి కాదు, పాప సంతోషం. ముందే చెపుతున్నాను గుర్తుంచుకోండి. ■

